# విజయసౌధము

గ్రంథకర్త:

విద్వాన్ శ్రీ ధూళిపాళ వేంకటసుబ్రహ్మణ్యము

PUBLISHERS:

LALITHA & Co.,

Eluru, W. Godavary.

1950.

Price Re. 1—0—0

# విషయసూచిక.







విజయసౌధ నిర్మాత

# విజయ ప్రాదుర్భావము

## దక్షిణాఫ్రికా సత్యాగ్రహము

### మహాత్మా గాంధీ.

### ౧

అది సాయంసమయము. అప్పుడు సుమారు నాలుగున్నర గంటలై యుండును. ఇరువురువ్యక్తులొకనగరమునందలి రాజవీధిని నడచుచుండిరి. ఆకసము మేఘావృతమై యుండెను. భాస్కరుఁడు దృష్టిగోచరుఁడు కాకుండెను.

అది ఆఫ్రికా ఖండములోని నేటాలు రాష్ట్రమునందలి దర్బాను నగరము. ఆపట్టణ వీధులవెంబడి కాలినడకనుబోవు వ్యక్తులలో నొకడు బలిష్ఠుఁడు. ఆనగరమునకు చిరపరిచితునివలె నుండెను. రెండవవ్యక్తి దుస్తులనుబట్టి భారతీయుఁడని చెప్పవచ్చును. ఆతని శిరముపై ప్రత్యేకమగు నొకవిధమైన తలగుడ్డ కలదు.

అటుల వారేగుచుండ భారతీయునిచుట్టును గొందఱు బాలకులు చేరిరి. అల్లరిచేయుట కారంభించిరి. రాలు రువ్వసాగిరి. వారందరు యూరపియనులు. ఇంతలో పెద్దలగు యూరపియనులుగూడ వారిని గలిసిరి. అంతకంతకు గోలచేయు వారి సంఖ్య పెరిగెను. ఇఁక నావ్యక్తు లొక్కయడుగైనను ముందునకుఁ బోఁజాలకుండిరి. రిక్షాబండిపై నెక్కి పోఁదలచిరి. కాని

యయ్యదియు సాధ్యముకాదయ్యె. రిక్షాలో నాభారతీయుని నెక్కించుకొనినచో నాశకటమును దుత్తుమురులు గావింతుమని యూరోపియనులు రిక్షావానిని భీతావహు నొనరించిరి. పాపమాతఁడు తనదారిని దానేగెను.

ఇఁకఁ జేయునదిలేక యట్టులే పయనమును సాగించుచుండిరి. వారు మఱియొకవీధికిఁ జనునప్పటికి బాధించుయూరోపియనులసంఖ్య పెచ్చుపెరిగెను. ఆపాంథులలోని బలిష్ఠుని దూరమునకు గొనిపోయి పడవేసిరి. రెండవయాతని దూషించి, పీడించి, బాధించుచుండిరి. రాలు రప్పలేగాక వారికి చేతికందిన దానినెల్ల వానిపై విసరుచుండిరి. తుట్టతుదకు వానిపైఁబడి శిరోవేష్టమును లాగివేసిరి. ఒక దురాగతుఁడు వానిమొగముపై బలముగకొట్టి, బూటుకాలితోఁ దన్నెను. పాప మాతెరువరి స్మృతిదప్పి భూమిపైఁ బడఁబోవుచు, నెట్టులో నొకయూతఁ గొని నిలిచి, కొంతసేదఁదీఱి, మరల నడచుట కారంభించెను. గమ్యస్థానము చేరగలుగుదునను నాశ యాతని కిసుమంతయు లేదు.

అది యేమివింతయోగాని యెంతబాధనొందుచున్నను నాతని ముఖవికాసమున కోపచిహ్నములు గోచరించుటలేదు. ఆయికట్టులను భగవంతుని దలఁచుచు నాతఁడు స్థిరచిత్తమున మున్ను ప్రహ్లాదుఁడు హిరణ్యకశిపునివలన బాధలను భరియించినరీతి ననుభవించుచుండెను. హృదయమునందును వారిని దూషించుచున్నజాడ గోచరించుటలేదు.

భగవంతుని నమ్మినవానికి తప్పక భగవంతుఁడే సాయ పడును. ఇట్లు దురంత బాధానలజ్వాలలఁ జిక్కియున్న నాబాట సారిచెంత కొకస్త్రీమూర్తి వచ్చెను. ఆమె యాతని నెఱిఁగి యున్నట్టులే యున్నది. ఆమె ధైర్యశాలి. తన గొడుగువిప్పి వానిప్రక్కగ నడచుచుండెను. యూరపియనులు స్త్రీల నవమా నింప గొంతజంకుదురు. ఆపైన యామె ప్రజారంజకుఁడైన పోలీసు పైయధికారియగు అలెగ్జాండరుగారి భార్యయగుట మనబాటసారి సురక్షితుఁడయ్యెను. కాని వారు విడువలేదు. ఆమెకుఁ దగులకుండ వానికిమాత్రమే తగులునట్లుగ నేర్పుతో రాలురువ్వుచునే యుండిరి. ఇంతలో నీవార్త పోలీసుఅధికారికి తెలియవచ్చెనుగాఁబోలు కొందఱుపోలీసులను రక్షణార్థము వారిచెంత కంపెను. వారు వారిచుట్టునుజేరి సురక్షితముగ పోలీసుఠాణాకు వారిని జేర్చిరి. వారి రాకకై వేచియున్న యాపోలీసు అధికారి వానిజూడగనే యెదురుగావచ్చి సాదర ముగ వానితో నిట్లనియెను.

'గాంధిజీ! ఇదియేమి?'

'ఇది భారతీయుల కెల్లపుడుజరుగు ననుభవమేకద! ఇందు వింతయేమికలదు స్వామీ!'

'తమరెక్కడికి చేరవలెను?'

'అయ్యా! రుస్తుంజీసేటు గృహమునకు.

'అయిన నేడు మాయింట నాతిథ్యము స్వీకరించి రేపు దయచేయుడు.

'వందనములు. మీమర్యాదకు కృతజ్ఞుఁడ. మీధర్మపత్ని నాప్రాణముల గాపాడినది. మీరు నన్ను రక్షించితిరి. దయయుంచుఁడు. గమ్యస్థానమునకు నేఁడే చేరవలయును.' పిమ్మట సెలవుగైకొని, మఱిమెట్టియిడుములకు లోనుగాకయే గాంధిజీ రుస్తుంజీసేటు భవనమును జేరగలిగెను.

ఇంతటితోనైనను వాని కడగండ్లు గట్టెక్కలేదు. రుస్తుంజీసేటు గృహప్రాంగణమున వేలకొలఁది యూరోపియనులు గుమిగూడిరి. అప్పటికే సూర్యుఁ డపరాద్రి గ్రుంకుట వలన నంధకారము నలుదెసల నావరించెను. ఆ చీఁకటియందా జన సమూహము గగ్గోలుగావించుచుండిరి. గాంధిజీని వారి కొప్పగింపవలయుననియు లేదేని యాక్రొంపకు నిప్పంటింతుమనియు కేకలు వేయుచుండిరి. సహజగాంభీర్యుఁడగు రుస్తుంజీ మాత్రము మేరువువలె సుస్థిరుఁడై, కడింది ధైర్యమును బూనియుండెను.

ఈ వృత్తాంతము పోలీసు అధికారియగు అలెగ్జాండరునకుఁ దెలిసెను. వెంటనే యాయన కొందఱు గూఢచారులు వెంటరా నా యల్లరిమూఁకను జొచ్చెను. మెల్లగా భవన ప్రాంగణమునకుఁజేరి సింహద్వారమునెదుట నిలిచెను. వారితో నేదియో సంభాషించుచున్నట్లు నటించుచు వారిని శాంతులఁ గావింపఁ జూచుచుండెను. రహస్యముగాఁ దన గూఢచారిని భారతీయ వర్తకవేషమున నింటిలోనికి వేరుమార్గమున నంపి గాంధిజీని భారతీయ రక్షకభటవేషమున నటనుండి తప్పించు

కొను నేర్పాటు గావించి తత్ప్రయత్నమున కృతకృత్యుఁ డాయెను. గాంధిజీ సురక్షితముగ పోలీసుస్టేషనునకుఁ జేరిన సమాచారము చేరినవెంటనే యా గుంపులోనుండి నలుగు రొక సంఘముగా నేర్పడి లోనికేగి గాంధిజీని బట్టుకొనుఁడని వారలకుఁ దెల్పెను. వారటులే గావించి, గాంధిజీ యంతకు ముందే యా నివేశమునుండి నిర్గమించినట్లు గ్రహించి నిరాశ చెంది నిస్పృహతోఁ దమతమ నివాసములకుఁ జనిరి. ఈ సంఘటనము 1897 సంవత్సరము జనవరి 13 వ తేదీన జరిగెను.

గాంధికి దక్షిణాఫ్రికా కిది రెండవతూరి రాక. మొట్ట మొదట 1893 లో తమ గ్రామములో నున్న యొకానొక మహమ్మదీయ వర్తకుని వ్యవహారములో దక్షిణాఫ్రికాయందు జరుగుచున్న వ్యాజ్యమునందు న్యాయవాదిగా జనియెను. కాని వానిని న్యాయస్థానమునందును, బైటను బెక్కుకష్టము లెదు ర్కొనెను. భారతీయులకు నా ఖండమున గలుగుచున్న కష్ట పరంపరల నాతఁడవగాహనము చేసికొనెను. కాని తాను జనుదెంచిన కార్యము సఫలమయిన వెంటనే యాతఁడు 'ఇండియా'కుఁ బోవ సమకట్టెను. వాని నటకుఁ బిలిపించిన దాదాఅబ్దుల్లా సంఘమువారు వానికి వీడ్కోలు విందు నేర్పఱి చిరి. ఆ సమయమునందే మర్క్యూరీ అను వార్తాపత్రిక నంచి కను జదువుచుండగా వానికి 'భారతీయులకుండు ఎన్నికహక్కు' అను శీర్షిక పెద్ద యక్కరములతో గానుపించెను. భారతీయుల యెన్నికాధికారములను దొలఁగించు చిత్తుచట్టమును నేటాలు

శాసనసభయందు చర్చింపఁబోవుచున్నటుల చదివెను. అచ్చట హాజరుగానున్న వర్తకులకు నితరులకును నా చిత్తుచట్టమును గుఱించియు, దానివలన భారతీయులకు గలుగబోవు నష్టముల గూర్చి వివరించి, తమ యెన్నికహక్కును దొలఁగించెడి యట్టి క్రూరశాసనమును దృఢముగా నెదుర్కొనుట ప్రతి భారతీయుని విధి యని ప్రబోధించెను.

జరుగబోవు నన్యాయమును నందఱును గుర్తించిరి. గాంధిజీ చెప్పినదానిలోని యాథార్థ్యమును నంగీకరించిరి. కాని యేమిచేయవలెనో వారికి దెలియదనియు, గాంధిజీనే యచటనుండి వారికి సహాయపడవలసినదనియుఁ బ్రార్థించిరి. ప్రజాసేవకొఱకే తనువును దాల్చితినని విశ్వసించు గాంధిజీ వెంటనే యంగీకరించి తన పయనమును విరమించుకొనియెను. ఇఁకఁ బ్రభుత్వమువారితోఁ బోరాటమున కారంభమును జేసిరి.

సేట్ హాజీ అధ్యక్షుఁడుగా నొక సంఘ మప్పుడపుడే యేర్పరుపఁబడెను. చిత్తుచట్టముపై తమ నిరోధమును దెలియ జేయుచు వెన్వెంటనే తంతివార్తను సర్కారువారికిఁ బంపిరి. ఇవ్విధముగా శాసనసభకు భారతీయులు మహాజరు పంపు కొనుట దక్షిణాఫ్రికా చరిత్రలో నిదియే మొట్టమొదటిసారి. దీనితో భారతీయబృందమున నవచైతన్య ముదయించెను. ప్రతినిత్యము సభలు ద్విగుణీకృతోత్సాహముతోఁ జరుపఁ బడుచుండెను. చందాలు వసూలుచేయఁబడెను. వలంటీరులు పెక్కురు చేర్చుకొనఁబడిరి. ఒక్క మాసము దినములలో

బదివేల సంతకములు సేకరింపఁబడి మహాజరు రిప్పన్‌ప్రభువు నకుఁ బంపఁబడెను. ఇఁక గాంధిజీ సెలవు గైకొనఁదలఁచెను. కాని భారతీయ సంఘము వానిని బోనీయరైరి.

1894 లో నేటాలు భారతమహాసభ స్థాపింపఁబడెను. రాజకీయ చైతన్యము భారతీయుల హృదయ ఫలకములం దుద యించెను. ఇంతలో రిప్పనుప్రభువు భారతీయుల యెన్నిక హక్కును నివారింపఁ బ్రవేశపెట్టఁ దలఁచిన చిత్తుచట్టమును నిరాకరించెను. దానితో భారతీయుల కమితానందముగలిగెను. విజయోత్సాహ భరితులైరి.

నేటాలునందువలెనే ట్రాన్సువాలు, కేపుటౌనులందును భారత మహాసభలు నెలకొల్పబడినవి. ఈ మూఁడుసభల యాశయ మొక్కటియే గాని సభారచనా నిర్మాణమునందును నియమ నిర్ణయములందును వ్యత్యాస మెంతయో గలదు.

' 1895 లో గాంధీజీ దక్షిణాఫ్రికా భారతీయుల యంగీ కారము వడసి స్వదేశమునకరిగెను. అచట లోకమాన్యతిలకు, గోఖ్లే మున్నగు నాయకాగ్రణుల దర్శించి వారి యనుమతితో పూనా మున్నగు పట్టణములలో మహాజనసభలయందు దక్షి ణాఫ్రికా భారతీయుల యుదంతముల హృదయములు ద్రవించు నటుల నివేదించెను. మదరాసునందును నట్లులే యుపన్యాస మొసఁగెను. కలకత్తానగరమందును నట్టియేర్పాటు గావించు చున్నతఱి తత్‌క్షణమే బయలుదేరి రావలసినదిగా వానికి తంతివార్త వచ్చెను.. గాంధిజీ మరల దక్షిణాఫ్రికాకు వెళ్లెను.

ఈ రెండవపర్యాయము వెళ్ళినపుడే గాంధిజీకి మొదట వివరింప బడిన సమాదరము గావింపఁబడినది. అందులకు ముఖ్యకారణము భారతదేశమున గాంధిజీ దక్షిణాఫ్రికా యూరోపియనులపై నిందలు మోపి, వారిని దూషించినట్లు గోరంతలు కొండంతలుగాజేసి వ్రాసిన ఆంగ్లదేశపు వార్తాసంగ్రహములే.

దక్షిణాఫ్రికాయందున్న డచ్చివారికి బోయరులను నామము కలదు. బంగారుగనుల యజమానులచేఁ జేయఁబడిన కుట్రననుసరించి బోయరుయుద్ధము ఇంగ్లీషువారికిని, డచ్చివారికిని తటస్థించెను. అందు గాంధిజీ ఇంగ్లీషువారిపక్షమున నిలచి భారతీయుల సహాయ సంపత్తిని వారల కందఁజేసెను.

స్వార్థపరులు తమ యావసరమున కితరుల నుపయోగించుకొందురు గాని యన్యుల సహకారమునకు వారెన్నడును ప్రతిఫల మీయజాలరు. యుద్ధము ముగియగనే భారతీయులకుఁ గ్రొత్తవిపత్తు సంభవమాయెను. ట్రాన్సువాలురాష్ట్రములోనికి భారతీయుల నెవ్వరిని బ్రవేశింపనీయని నియమములఁ గొన్నిఁటి నేర్పరచిరి. వారి కనుమతి పత్రముల నిచ్చుటకని యొకశాఖను ప్రభుత్వమునందేర్పరచిరి. అది 'ఆసియావాసుల శాఖ'. అది నిజముగా నాజ్ఞాపత్రముల నొసంగుటకంటె భారతీయుల ప్రవేశమును నిరోధించుటకే యేర్పడినదని తెలిపిన నతిశయోక్తి యుండదు.

బ్రిటీషు ప్రభుత్వమున చాంబర్లైను నాఁటి వలసరాజ్యముల మంత్రిగానుండెను. అతఁడు దక్షిణాఫ్రికా రానుండెనని

యెల్లరకుఁ దెలిసెను. గాంధిజీ నాయకత్వమున వానిని జర్పిం చుట కొరకు రాయబారసంఘము నియమింపఁబడెను. చాంబ ర్లైను వచ్చెను. మహాజరును ముందుగనే పంపిరి. గాంధిజీ సందర్శనా నిరీక్షకుఁడై తమ కష్టసుఖుల విన్నవించుకొన నుంచి యుండెను. గాంధియను నామమాయన వినినంతనే "దర్బానున నింతకుముణ్నె గాంధిని జూచియుంటిని. ట్రాన్సు వాలులోని స్థితిగతుల నచటివానిమాత్రమే తెలుసుకొనవలెను కాన గాంధిజీని జూడఁదలఁచలేను" అని నిరాదరణ సూచక మందహాసాంచిత వదనుఁడై పలికెను.

ఇఁకఁ బ్రయోజనము లేదని గాంధిజీ ఇండియాకు బోవఁ దలఁచెను. కాని దక్షిణాఫ్రికా భారతీయులు తమను విప త్పయోధినుండి తరింపఁజేసి భారతదేశమున కరుగ వానిని బ్రార్థించిరి. వారి వేఁడికోలును మన్నించి యచటనే న్యాయ వాదిగానుండి వారికి సేవ యొనర్చుటకు గాంధిజీ నిశ్చయించు కొనెను.

ఆశియాశాఖను రద్దుపరుప గాంధిజీ యెందరెందరో యుద్యోగస్థులచెంతకు రాయబారములు గొనిపోయెను. అర్జీలు దాఖలుచేయించెను. మహాజరులు పెట్టించెను. ఏది చేసినను నేదియో స్వల్పోపశమనములేకాని మఱి పూర్తిగ పరిష్కార సాధనములు కనుబడవయ్యెను. సంప్రతింపుల ఫలితముగా తాత్కాలిక సంధి కుదిరెను. భారతీయులందఱు నూతనముగా ననుమతిపత్రముల స్వీకరింప సమ్మతించిరి. ఇందు భారతీయు

లెల్లరు నతి శీఘ్రకాలముననే తమతమ యనుజ్ఞాపత్రములు వడసి తమ యైకమత్యమును, సత్యసంధతను, వినయభావమును బ్రదర్శించిరి.

నేఁటివఱకును మనకు దెలిసియున్న ప్రపంచ చరిత్రిలో సుస్థిర శాంతి చేకూరినట్లు మనము చదివియుండలేదు. కాల ప్రవాహ మహాశక్తి నిరుపమానమైనది. ఒడిదుడుకులు దాని నైజములు. కొంతకాలము పోరు, కొంతకాలము శాంతి. ఈ ద్వంద్వ మనివార్యము.

దక్షిణాఫ్రికా చరిత్రలో మరల కఠినపరీక్షా సమయ మేతెంచినది. సుషుప్తిం జెందిన కాలాహిని మేల్కొల్ప కర్టిసు మహాశయుఁడు తలకొనెను. ఈ ప్రభుత్వోద్యోగి సలహా ననుస రించి కఠినశిక్షా నియమబద్ధమైన క్రొత్త చట్టమొకటి భార తీయులపైఁ బ్రయోగింపఁబడెను. ట్రాన్సువాలు ప్రభుత్వపు 'గెజటు' నందు చిత్తుచట్టము ప్రత్యక్షమయ్యెను. దీనిని నల్ల చట్టమనిరి.

'గెజటు' ను దెప్పించి యాచట్టమును గాంధిజీ యామూ లాగ్రము పఠించెను. చదువుచున్నకొలఁది యాయన యాపాద మస్తకము కంపించెను. కన్నులలో నీరు గిఱ్ఱునతిరిగెను. బాష్ప తోయములు జాలువాఱెను. అందలి ప్రత్యక్షరము జాతిద్వేష మనెడి విషానలావిష్టమై వానికన్నుల కొక్కొక్క యక్కర మొక్క రక్కసివలె సాక్షాత్కరించెను. భారతీయుల కిది కఠిన పరీక్షాసమయము. ఆచట్టము నెదిరిచి జయమొందుటయో,

సర్వనాశన మొందుటయో తేల్చుకొనవలసిన సమయమాసన్న మాయెను.

ఆచట్టమునందలి సారాంశమిద్ది. ఎనిమిదేండ్లు దాటిన ప్రతిభారతీయ స్త్రీ పురుషుఁడును ఆసియావాసులరిజిష్ట్రారునొద్ద తన పేరును నమోదు చేయించుకొని ధృవ పత్రమును బొంద వలయును. అందుకు పేరు, నివాసము, కులము, వయసు దెలుపుచు దరఖాస్తు చేసికొనవలెను. దరఖాస్తు పెట్టకుండుట నేరము, శిక్షార్హము. ధృవపరచుకొనుటకు పదివ్రేళ్ళ ముద్ర లను రిజిష్ట్రారుగారి యెదుట వేయవలయును. పోలీసుయుద్యోగి యెప్పుడడిగిన యప్పుడు ధృవపత్రమును జూపుచుండవలయును. నిర్బంధముగా వ్రేలిముద్రలను నేరస్థులనుండి దప్ప నితరులనుండి గైకొనుట సాంప్రదాయము కాదు. స్త్రీలను, పదియారేండ్లకు మించని బిడ్డలను గూడ ధృవపడవలె నని కోరుట ప్రపంచ చరిత్రలో నిదియే మొదటిఘట్టము.

---

## ౨

1906 వ సంవత్సరము సెప్టెంబరు పదునొకండవ తేది ఉదయముననే జోహానిస్బుర్గులోని యూదుల నాటకశాల చిత్రవిచిత్ర తోరణములతో నలంకరింపఁబడి యుండెను. ట్రాన్సువాలు రాష్ట్రమునందలి వివిధప్రదేశములనుండి ప్రతి నిధులు వచ్చి నాటకశాలఁ బ్రవేశించుచుండిరి. ఒక్క గంట

కాలములో శాలయంతయు భారతీయులతో నిండిపోయెను. రంగస్థలమున నమర్చబడిన వేదికమీఁది యధ్యక్షస్థానమున అబ్దుల్‌గని యను ప్రముఖుఁడుండెను. ఆతఁడే ట్రాన్సువాలు బ్రిటిషుఇండియాసంఘమున కధ్యక్షుఁడు. చిరకాలమునుండియు ట్రాన్సువాలునందే కాపురమున్న వర్తకప్రముఖుఁడు.

సభ జయప్రదముగ నిర్వహింపఁబడెను. సభ్యులు చూపిన యుత్సాహ మపారము. వారియందేదియో మహత్తర తేజస్సు ప్రవేశించినటుల వారి ముఖవికాసములు వెల్లడించు చుండెను. గురుతర బాధ్యతాభారధూర్వహులయిన సామాజికులు ప్రదర్శించిన నియమనిష్ఠలు కౌతూహలోత్సాహములు వర్ణింపఁ దరముగాదు.

నాఁటి సభయందు నాలుగు తీర్మానములు చేయఁబడినవి. అందు ప్రధానమైనది నాలుగవది. అది ప్రభుత్వమువారు గావింపనున్న నల్లచట్టమును నెదిరించి పోరఁదలఁచినది. తమ ప్రతిఘటనమును నలక్ష్యమొనర్చి ప్రభుత్వ మా చిత్తుచట్టము నే తమ తలలపై రుద్దినచో దాని కెంతమాత్రమును లొంగక, తత్ప్రయత్నమున సంభవించు శిక్షాసముదాయమును పరమ సహనభావమున ననుభవింపవలయును.

ఇట్టి మహత్తర ప్రతిభావంతమగు తీర్మానమును గావించుటకు కారకుఁడు శ్రీ గాంధిజీయే గాని యన్యుఁడు కాఁడు. ఈ సిద్ధాంతమును ప్రవచించిన మహాత్ము మాసంపన్నుఁ డాయనయే. ఇదియే సత్యాగ్రహ సమరమునకు నాంది. ఈ తీర్మా

నమును బ్రవేశపెట్టుచు గాంధిజీ సామాజికులకు దాని విశిష్ట తను వెల్లడించుచు దీర్ఘోపన్యాసమును గావించునపుడు సద స్యులు శాంతచిత్తములతో వినిరి. వారి యెడందలయం దచంచల ధైర్యము, కష్టసహిష్ణుతాభావము, తమ కార్య క్రమమునందు సుస్థిర సంకల్పము సంఘటించెను. మానస కుసుమములు ప్రఫుల్లములాయెను.

ఈ తీర్మానమును బలపరచుచు సేట్ హాజీహబీబ్బు అను నాతఁడు గావించిన యుపన్యాస ముత్సాహపూరితమైనది. దైవసాక్షిగా నీకఠినశాసనమును నిరోధించుకట్టుల భీరుత్వ మును జూపరాదని యాతఁ డావేశపూరితస్వాంతమున నుద్ఘా టించినపుడు గాంధిజీ పులకితగాత్రుఁడయ్యెను. దేవునిపై యొట్టిడికొని కార్యరంగమున దుముకవలయునని యాతఁడు హెచ్చరించినతఱి గాంధిజీ తన బాధ్యతనేగాక దక్షిణాఫ్రికా భారతీయుల బాధ్యతనుగూడ గ్రహించెను.

సభాధ్యక్షుని యనుమతితో హాజీహబీబ్బు ప్రతిపాదిం చిన సలహాను వివరించుటకు గాంధిజీ యుపన్యాస వేదికపైకి వచ్చెను. సభయంతయు గంభీరపారావారముంబోలె నిశ్చలమై, పరమయోగి మానసంబుంబోలె నియమబద్ధమై, ఉదగ్రా హార్యనితంబంబుంబోలె సముచ్ఛ్రితమై యలరారుచుండెను.

"నేఁడు మన మంగీకరింపఁబోవు తీర్మానము ప్రధాన మైనది. దీనిని మనమాచరించు విధానముపైననే మన భారతీ యుల కీగడ్డపై నాశ్రయము గలదో లేదో స్థిరపడుపఁబడును

ఇచటి భారతీయుల కిది జటిలమైన సమస్య. హాజీహాబీబ్బు సూచించిన విధానము వినూత్నమయి, మతసంస్కార స్వభావము గలదియై యున్నది. ఇట్టి సలహాను గావించిన మన స్నేహితుఁడు కృతజ్ఞతాపాత్రుఁడు. ఆతని సూచనము మిక్కిలిగ సమాదరింపఁ దగియున్నది. ఆ ప్రతిపాదనము సర్వవిధముల పరిశీలనీయము.

మనుజుఁ డేమతావలంబియైనను నేదో యొక దేవుని నమ్ముచున్నాఁడు. కావున దేవునిపేర ప్రమాణముచేయుట పవిత్రమైన కార్యము. ఇట్లు ప్రతిజ్ఞచేసినపిదప నియమమును బాటింపని యెడల దేవుని దృష్టియందును, మానవుని దృష్టియందును కిల్బిష మొనర్చినవాడగును. అట్టివాఁడు రెండు లోకములందును శిక్షార్హుఁడగును. కావున ప్రతి వ్యక్తియు యోచించి జాగ్రత్తను వహించి ప్రమాణముచేయవలసిన బాధ్యత యెంతయో కలదు.

తఱచుగా ప్రతిజ్ఞలను గైకొనుట సత్సంప్రదాయము గానేరదు. చీటికిమాటికి బాసచేయువాఁడు తప్పక చెడిపోవును. అతఁడు ప్రతిజ్ఞాపాలనము నొనరింపఁజాలఁడు. మిక్కిలి యుపద్రవ పరిస్థితులందు మాత్రమే ప్రతినఁబూనుట తగవు. అట్టి సంఘటనలు జీవితమున నొకటి రెండు సారులు మాత్రము తటస్థించగలవు. దక్షిణాఫ్రికా భారతీయుల కియ్యది నిజముగా నట్టి యదను. ఇట్టి జీవన్మరణసమస్యయందు మన మప్రయోజకులమై, కర్తవ్యపాలనాసంరంభమున వెనుకంజవేసిన నధిక

పాతాళమునకుఁ ద్రొక్కఁబడుట సత్యము. నేఁటి యావేశమున ముఖప్రీతికై శపథమొనర్చి పిమ్మట మెల్లగా జారుకొనిన వానికంటె నేఁడే తన శక్తిని పరీక్షించుకొని తానీయుద్యమమునఁ జేరఁజాలనని నిశ్చితిమొయి వాక్రుచ్చినవాఁడే ధైర్యవంతుఁడు.

ఇఁక మనకు సంభవింపనున్న విపత్తులఁ గూర్చి కొంచె మూహించుకొందము. మన ప్రతిఘటన బలమువలన చట్టము రద్దయినచో సంతసింపఁదగిన విషయమే. అట్లు గాకయున్న పక్షమున మనలో చాలమందిగాని, యందఱుగాని కారాగారములకుఁ బంపఁబడవచ్చును. అంతియేకాదు. అచట పరాభవింపఁబడవచ్చును. చెఱసాలయందలి నివాసము సౌఖ్యప్రదము కానేరదుగదా! శీతవాతాతపముల ననుభవించుట, బహుళతర బాధాజనక కార్యభారము పైఁబడుట, కారాగృహాధికారుల దయాధర్మపాలనమున జిక్కి తదుదగ్రభీకర వేత్రప్రహరణార్పిత దేహులగుట జరుగవచ్చును. మఱియు నార్థికముగఁ బెక్కు నష్టముల పాలు గావింపఁబడుటలో నాశ్చర్యమేదియు లేదు. తమ తమ భూవసతులు వేలము వేయఁబడి కటికదరిద్రులుగాఁ జేయఁబడవచ్చును. ఇంతయేల తుట్టతుదకు భీకరమృత్యువు వాతనైనను బడవచ్చును.

కావున బాధ్యతల నన్నిఁటిని గుర్తించి, యితరుల కొఱకైగాక యెవరి బాధ్యతపై వారిప్రమాణము చేయుదురు గాకయని హెచ్చరించుచున్నాను.”

ఇప్పుడిది గాంధిజీపలుకఁ బలుకఁగ శాంతరసముప్పతిల, బాధ్యతానిరూపణ మొనర్చుచు, హెచ్చరికలుగావించుచు, విస్పష్టముగ నుపన్యాస మొసఁగి కూర్చుండ సభికులు కరతాళ ధ్వనులతోఁ దమ యామోదమును వెల్లడించిరి. మఱికొందఱు సభ్యులును, సభ్యేతరులును మాటలాడిన యనంతరము తీర్మానము నేకగ్రీవముగా సభాసదు లుత్సాహముతో నామోదించిరి.

ఈయుద్యమమున కేనామము నుంచుటయా యను నాలోచనము జరిగెను. గాంధిజీ సాత్త్వికనిరోధము (Passive Resistance) అని తొల్తయుపయోగించెను. అది ఆంగ్లపదమగుట వారికిష్టము గాకుండెను. కావున నీపోరాటమునకు జాతీయనామ మేదియైన సూచించినవానికి బహుమాన మీయఁబడునని 'ఇండియన్ ఒపీనియన్' అను దక్షిణాఫ్రికా భారతజాతీయ పత్రికయందుఁ బ్రకటించిరి. అందుపై మగన్‌లాల్ గాంధి యను నాతఁడు 'సదాగ్రహము' సదుద్యమములలో స్థిరత్వమను సర్థముతో సూచించెను. గాంధిజీ దాని నామోదించి స్వల్పమార్పులతో 'సత్యాగ్రహము'గా నేర్పఱచెను. వారియుద్దేశములో సత్యమనఁగాఁ బ్రేమ. ఆగ్రహమనఁగా స్థిరత్వమునుగూర్చునది యని యర్థము. అనఁగా దౌర్జన్యరాహిత్యమునుండి యుత్పన్నమయిన మహత్తరశక్తి. ఈసత్యాగ్రహపదము నేఁటికందఱకును విశ్రుతమయియే యున్నది.

భారతీయు లెంతగ మొఱవెట్టికొనినను 'నల్లచట్టమను' క్రూరశాసనమును దక్షిణాఫ్రికా ప్రభుత్వము గావించెను.

అర్దానిని శాంతముగాఁ బ్రతిఘటించుటకు గాంధిజీ నాయకత్వ మున భారతీయులు సమకట్టిరి. ఆచట్టమునకు భయపడి యెవ్వఁడును ధృవపత్రములు పొందకూడదని ప్రచారముగావించిరి. అంతటితో నూరకొనక స్వైచ్ఛికభటుల (Volunteers) నియమించి తెలియక ధృవపత్రములకై ప్రభుత్వభవనములకుఁ బోవువారలకుఁ బ్రబోధముగావించి వారిని తత్ప్రయత్నమునుండి విరమింపఁజేయుచుండిరి. ఈకృషియందు వారు దిగ్విజయము నే పొందిరనియు, నవిరళశాంతమును, నోర్పును బ్రదర్శించిరనియు, జెప్పవచ్చును. మొత్తముపై నయిదువేలకుమించి నూతనముగా ననుమతిపత్రములు గైకొనినవారులేరు. సర్కారువారు దిగ్భ్రమ చెందిరి. ఏవిధమగుచర్య గైకొనుటకు వారికిఁ దోఁచలేదు. ఎదిరించినవారిని శిక్షించి బాధించగలరుగాని పరమశాంతముతో నున్న వారి నేమిచేయగలరు? వారికి పచ్చివెలగకాయ గొంతున బడినట్లాయెను. ఎట్టకేల కేరినోనొకరిని కారాగృహబద్ధునిగావింప సంకల్పించిరి. అంతటితో భారతీయులు భీతచిత్తులయి, తమయుద్యమమునుండి విరక్తులగుదురని వారియూహ.

జర్మిస్టననగరమున నాఁడొక మహోత్సవము జరుగుచుండెను. పురవీధులయందు కోలాహలము విపరీతముగ నుండెను. అట్టిచో నొకవృద్ధుఁ డొకయువకుని బిలిచి యిట్లనెను.

"నాయనా! ఈ యలబలమునకుఁ గారణమేమి?"

"తాతా! నీకింకను దెలియులేదా? మన పండితరామసుందరుని ప్రభుత్వమువారు చెఱఁగొనిరి

"అయ్యో! పాప మాతని నేలఖైదుగావించిరి?"

"దాదాజీ! గాంధిజీ నాయకత్వమున సత్యాగ్రహ సమరము సాగుచున్నయదిగదా! మనపైఁ బ్రయోగింపఁబడిన 'నల్లచట్టము'ను బ్రతిరోధించుటకు భారతీయులమెల్లరము శపథముల గావించితిమి. అనుమతిపత్రముల గైకొన నిరాకరించితిమి. ఈజర్మిస్టనులోని భారతీయులెల్లరకు రామసుందరుడే నేత. అందువలన నాతని నిర్బంధించిన మిగిలినవారు భయపడుదురని యాతనినే ప్రప్రథమమున బంధించిరి."

"మఱి యీకలకల మేమి?"

"ఆతని నిర్బంధమువలనఁ బ్రజలు భీతావహులుగాకుండుటయేగాక యుత్సాహమును గనఁబఱచుచు మమ్ములను జైలున కంపుడు, మమ్ములను శిక్షించుఁడని ముందునకు ధైర్యముగ వచ్చుచున్నారు. ప్రప్రథమ సత్యాగ్రహఖైదీ యయినందున నాతని నభినందించుచున్నారు."

నిర్బంధింపఁబడిన పండితునకు నెలదినములు విడిఖైదు శిక్షవిధించిరి. జోహానిస్బర్గు చెఱసాలలో నుంచిరి. స్వేచ్ఛగా నాతనితో సంభాషించుటకుఁ బ్రజల కనుమతీయఁబడెను. ఆహారమును దెప్పించుకొనుటకును ననుజ్ఞయొసంగబడెను. ఇంకనేమి పిండివంటలతో వంటకము లాయనకుఁ జేరుచుండెను. వలయు పదార్థములెల్ల నాతనికి సమకూర్చఁబడినవి.

ఆసియాశాఖ యను నొకశాఖను బ్రభుత్వ మనుమతి పత్రములొసఁగుటకై యేర్పఱచియుండిరి. ఆశాఖవారు నిరాశ

చెందిరి. కాని ప్రభుత్వమువారు పట్టుదల వీడలేదు. భారతీయులనెల్లర శాసనోల్లంఘన నేరమునకు శిక్షింప సమకట్టిరి.

1908 సంవత్సరము జనవరి 10 వ తేదీ గాంధిజీ మఱి కొందఱితో న్యాయస్థానమున ప్రవేశించెను. ఇతరు లెవ్వరును వాదింపఁ దలపెట్టలేదు. కాని గాంధిజీమాత్ర మొక్క ప్రకటనమును గావించెను. అందతఁడు ప్రిటోరియాలోని దేశాభిమానులకు మూఁడుమాసములు ఖైదు విధింపఁబడినదనియు వారికంటె తానధికనేర మొనర్చినవాఁడగుట నత్యధికమగు శిక్ష విధింపఁబడవలెననియు కోరెను.

అనేక పర్యాయములు న్యాయవాదిగా నిలచిన న్యాయస్థానమున గాంధీజీ నేరస్థుఁడుగా నిలువఁబడవలసినవాఁడయ్యెను. ఆహా యెంతవానికైనను విధివ్రాఁత యనుల్లంఘనీయముగదా! గాంధిజీకి రెండు నెలలు శిక్షవిధింపఁబడెను. తక్కినవారికిని నట్టులే. అందఱిని జోహానిస్సుబర్గు కారాగారమునకు గొంపోయిరి. రామసుందరుని జూచినభాతి గౌరవముతో గాక కొంత కఠినముగనే వీరిని జూచిరి. దినక్రమమున ఖైదీల సంఖ్య పెచ్చుపెరిగెను. వారము రోజులలో నూటికి మించెను. చెఱసాలావాస మనుకొనినంత సులభముగాదు. స్వేచ్ఛ యరికట్టఁబడుటయేగాక భోజనాదులుగూడ సక్రమముగానుండ నేరవు. ఉదయ కాలమున నుప్పుకూడా లేనిజావ, మధ్యాహ్నము పదితులముల యన్నమును, పదితులముల రొట్టెయు నొసంగుచుండిరి. నెయ్యి ఉప్పు కొలఁదిగా నీయఁబడుచుండెను. సాయంత్రి

సమయములందు జావయును, బంగాళాదుంపల కూరయు లభించుచుండెను.

గాంధిజీ సత్యాగ్రహ ఖైదీలతో గూడి రెండువారములే కారాగృహమున నుండెను. ఇంతలో ట్రాన్సువాలు లీడరు అనుదైనికపత్రికాసంపాదకుఁడగు ఆల్బర్టు కార్టురైటు గాంధిజీ యున్న గదిలోనికిఁ బ్రవేశించెను. అతఁడు భారతీయ నాయకులకును ప్రభుత్వమునకును సంధి యొనర్చు యత్నమున నుండెను. ఆవిషయమును గాంధిజీతోఁ జర్చించెను. స్మట్సు సేనాని, నాఁడు ప్రధానమంత్రి. ఆయన యొద్దనుండి సంధిపరతులను దెచ్చి గాంధిజీకిఁ జూపెను.

ఆ సంధిపత్రము నందలి భాష గాంధిజీకి సరిపడలేదు. దానిని కొలఁదిగామార్చి తోడి ఖైదీలతో సంప్రతించి సంధి నంగీకరింతునని యాతఁడనెను.

ఇంతకు సంధియేమన భారతీయులు శాసన నిర్బంధమున గాక స్వేచ్ఛగా ధృవపడవలెను. ధృవపత్రమందుఁ జేర్చవలసిన విషయములను భారతీయులతో సంప్రతించియే చేర్చవలెను. అధిక సంఖ్యాకులిట్లు ధృవపడినచో నల్లచట్టము రద్దుచేయువలెను. ఈ తుదిపరతు గాంధిజీకి విస్పష్టముగ గోచరించలేదు. కావున దానిని స్పష్టముగ లిఖింపవలెనని కోరెను. కాని దానికి వారు సమ్మతింపలేదు. గాంధిజీయు వందనములతో నద్దాని నిరాకరించెను.

1908 సంవత్సరము జనవరి 30 వ తేదీ గాంధిజీ స్మట్సు సేనాని యొద్దకు గొనిరాఁబడెను, వారి సంభాషణములు

సుదీర్ఘకాలము కొనసాగెను. ఒకరినొక రభినందించుకొనిరి. తుదకు స్మట్సు గాంధిజీతో నిట్లనియెను.

"చిత్తుప్రతియందు నీవు గావించిన సవరణమును నేనంగీకరించెదను. భారతీయులెల్లరు ఐచ్ఛికముగా ధృవపడిన వెంటనే శాసన ముపసంహరింతును. మరల చట్టము గావించు నపుడు నీ విమర్శనమునకై పంపుదును"

"ఈ నిమిషముననే నీవు బంధవిముక్తుఁడవైతివి. తక్కిన వారిని గూడ విడువ వలసినదిగా నిప్పుడే యాజ్ఞ నంపుచున్నాను"

అప్పటికే రాత్రి యేడు గంటలైనది. సర్కారువారు ప్రయాణపు ఖర్చులు గాంధిజీ కొసంగిరి. వెంటనే గాంధిజీ జోహానిస్సుబర్గుకుఁ బయనమయ్యెను.

ఈసంధి నిబంధనముల నంగీకరింపఁ జేయుటలో గాంధిజీకి గొప్పయవరోధము తటస్థించెను. అందును పఠానుమిత్రులు మిక్కిలిగ పట్టువట్టిరి. వ్రేలిముద్రలు వేయుట వారికి గౌరవహీనముగ దోచెను. దీనిని గూర్చియే తొలుత గాంధిజీ ప్రబోధించి భారతీయులనందరను శాసన ధిక్కారమొనర్చి కారాగృహముల కేగ ప్రేరేచియుండెను. ఇప్పుడు మరల నాతఁడే వ్రేలిముద్రలు వేయసమ్మతింపుఁడు, మున్ముందుగ జని యైచ్ఛికముగ ధృవపరచుకొనుఁడని చెప్పుటలో వాని నాయకత్వమును శంకించిరి. స్మట్సుసేనానితోఁ జేరి యాతఁడు తమను మోసము చేయుచున్నాఁడని తలఁచిరి.

గాంధిజీ సంధి నియమానుసారము ధృవపడుటకు ప్రభుత్వ కార్యాలయమునకుఁ జనుచుండెను. ఆతని వెంట మీర్ ఆలం అను పఠానువర్తకుఁడు నడచుచుండెను. ధృవపత్రకార్యస్థానము కొంచెము దూరములోనున్న సమయమున మీర్ ఆలం గాంధిజీని పిలచెను.

"ఎక్కడికి పోవుచున్నావు!"

"నేను ధృవపత్రమును బొందుటకుఁ బోవుచున్నాను.'

"పదివేళ్ళ ముద్రల నొసఁగదలఁతివా?"

"ఔను. నీవు నాతో వచ్చునెడల రెండు బొటనవ్రేలి ముద్రిలతో నీకు ముందిప్పించెదను. అన్నివేళ్లు ముద్రలు వేసి నేను పిదప తీసికొందును."

ఈ వాక్యమాతని నోటినుండి వెలువడు చుండఁగనే బరువైన కఱ్ఱదెబ్బ యాతని మస్తకముపై బడుటయు, నాతఁడు 'హే రాం' అని యఱచుచు నేలపై నొరగి మూర్ఛిల్లెను. క్రిందబడిన వానిని మఱలకొట్టి తన్నిరి. గాంధిజీ యనుచరులు వారింపబోవ వారిపైనను వారు విజృంభించిరి. ఇంతలో గొందఱు యూరోపియను లాప్రదేశమునకు వచ్చి పారిపోవుచున్న మీర్ ఆలంను, వాని యనుచరులను బట్టి నిర్బంధించిరి.

గాంధిజీ యొక భిషగ్వర్యుని గృహమునకుఁ గొంపోబడెను. కొంత స్వాస్థ్యము చిక్కెను. ఇంతలో ఆసియా శాఖోద్యోగి కూడ నచటికే వచ్చెను. మొదటి ధృవపత్రము తాను పది

వ్రేలిముద్ర లొసంగి పొందవలెనని ప్రమాణము చేసితిననియు నందులకు వలయు కాగితముల తెండనియు నాతనిఁ బ్రార్థింప నాతఁడు వల్లెయని యట్టుగావించెను.

ఈ పనిముగిసిన యనంతరము న్యాయాధిపతి కొక తంతివార్తనంపెను. అందు మీర్ ఆలం తనపై గావించిన బలప్రయోగమున కాతని నిందితుఁడని తాను భావించుటలేద నియు, వానిని తన కొఱకై వెంటనే విముక్తుని గావింప వల యుననియు నివేదించుకొనియెను. కాని యూరోపియనుల యొత్తిడివలన న్యాయాధిపతి వారిని విడుదలగావింపకమూఁడేసి నెలల కఠినకరకము పాల్గావించెను.

సంధిమేఱకు భారతీయు లెల్లరు ఐచ్ఛికముగా ధృవప త్రములఁ బొందిరి. ఇఁక ప్రభుత్వము వారు 'నల్లచట్టమును రద్దుగావింప వలసియుండెను. కాని కథయంతయు నంత సవ్య ముగా నడచిన విశేషమేమి యుండును? స్మట్సుసేనాని యూరోపియనుల ప్రోద్బల, ప్రోత్సాహములకు గుఱియై వారి పలుకుబడికి లోనై నల్లచట్టమును శాసన బద్ధమొనర్చుటయే' గాక మఱియొక చట్టమునుగూడఁ బ్రవేశపెట్టెను. దానివలన క్రొత్తగావచ్చు భారతీయులును, ధృవపరచుకొనుటకు నాలసిం చినవారును నల్లచట్టమునకు గురికావలసిన వారేయైరి.

---

# 3

"ప్రియమైన స్మట్సుసేనానికి,

మాకును మీకును వెనుక జరిగిన సంధి నియమములు మఱియొకమారు తమ స్మృతిపథమునకుఁ దెచ్చుచున్నాను. మేమందరము నైచ్ఛికముగా ధృవపడినచో తాము చట్టము నుపసంహరింప వాగ్దాన మొనర్చియుంటిరిగదా! మావంతు కార్యమును తృప్తికరముగా నిర్వహించితిమని మీరును మీ పక్షమువారును నిదివఱకే యంగీకరించియున్నారు. కావున ప్రకృతము తమరు భారతీయులపైఁ గావించిన శాసనమును శీఘ్రముగఁ దొలఁగింపవలయును.

మేమిదివఱలో తమకనేక లేఖలను బంపుకొనియుంటిమి కాని యవియన్నియు నూసరక్షేత్రమునందు జల్లిన బీజముల తెఱంగున నిష్ఫలములే యయ్యెను. మేముప్రదర్శించిన శాంత భావమును, మేముజూపిన సైరణయును తమదేశ పరిహాస పాత్రమై మా యసమర్థత్వమును, మా భీరుత్వమునే తమకుఁ దెలియఁజేసినవి,

కావున పది దినముల లోపుగా నాశాసనమును దొలఁగించనియెడల మేమిదివరలో నైచ్ఛికముగాఁ గైకొనిన ధృవ పత్రముల నగ్నిహోత్రునకాహుతిగావించి, దాని ఫలితము ను వినయవిధేయతలతోఁ దలదాల్చుటకు సంసిద్ధతను జూప

వలసివచ్చును. ఇట్టి లేఖ వ్రాయవలసినందులకుఁ జింతించుచున్నాను.

ఇట్లు,

తమ విశ్వాసపాత్రుఁడు,

మో. క. గాంధి"

ఈలేఖకు ప్రభుత్వ భవనమునుండి వెలువడిన సమాధానమును గమనింపుఁడు.

"ప్రియమైన గాంధిజీ!

మీరు మీ ప్రజలపక్షమున పంపిన లేఖ చేరినది. ఇది ప్రభుత్వమును బెదరించుచు వ్రాసిన యంత్య సందేశమని మేము భావించుచున్నాము. దీనివలన నెట్టి ఫలితములు సేకూరునో మీరు బహుశః యూహించుకొని యుండకపోవచ్చును. కొందరు ద్రేకుల మాయాజాలముల జిక్కిన బీదవారగు భారతీయ ప్రజానీకము సర్వనాశనమగుదురేయని చింతిల్లుచున్నాము. ఇట్లు,

♦ ♦ ♦"

1908 సం॥ము ఆగష్టు పదునారవ తేది లేఖలో ప్రస్తావించిన గడువుకాలము నాఁటితోఁ బరిసమాప్తినొందెను. ఆ దినముననే శాసన సభయందు 'ఆసియా వాసుల చట్టము' శాసనము చేయఁబడినది.

సాయంకాలము నాల్గు గంటలైనది. జోహానిస్బర్గు లోని మసీదుముందు భారతీయులు బ్రహ్మాండమైన సభజేసిరి.

జనసమ్మర్ద మపరిమితము. ఉత్సాహావేశము లప్రతిహతములు. సభాస్థలమునందొకమూల వేదికపైఁ బెద్ద భాండలి నొకదాని నమర్చియుండిరి. అందు తమ యనుమతిపత్రముల నన్నిటిని నుంచి దహనమొనర్ప సంసిద్ధులై యుండిరి.

సభ ప్రారంభమయ్యెను. గాంధిజీ మరల హెచ్చరికను గావించెను. భీతచిత్తులగు వారు తమ యనుమతి పత్రముల గైకొని నిజనివాసముల కేగవచ్చును. అందులకు వారు లజ్జింప వలసిన యవసర మిసుమంతయు లేదు. కాని యెవ్వడు నందుల కంగీకరింపలేదు. రెండువేలకు మించి యనుమతి పత్రములు వచ్చెను. వానిని తైలమున ముంచి భాండలిలో వేసి యగ్నిని ప్రజ్వలింపఁ జేసిరి. దుష్ట శాసన నిర్మూలనము సేయునెడ నుప్పొంగునో యన పావకుఁడు సప్తజిహ్వలఁ దెరచి నాకసము నంటుచు పత్రములను భస్మీపటలము గావించెను. మంటలు మింటి కెగయుచుండ సభికుల హర్షారావములు రోదసీకుహ రము నావరించెను.

ఇది యిట్లుండ విద్యావంతుఁడగు భారతీయుఁడు ట్రాన్సు వాలు ప్రవేశింపరాదను ప్రవేశ నిరోధశాసనమొండు గావింపఁ బడెను. అదియును సత్యాగ్రహోద్యమమున జేర్చిరి. తనహక్కును సంరక్షించుకొను నిమిత్తము, శాసన ధిక్కారమును బుద్ధి పూర్వకముగ నొనర్చి సోరాబ్జీ యను పార్శీవర్తకుఁడు ట్రాన్సు వాలులోనికిఁ బ్రభుత్వమువారికి ముందుగనే తెలియచేసి ప్రవేశించెను. కాని ప్రభుత్వమువారాతని నిర్బంధించలేదు.

తుదకు ట్రాన్సువాలు వీడి స్వరాష్ట్రమున కేగుమనిరి. అందుల కాతఁడు నిరాకరించెను. తుదకు నెలదినములు జైలుశిక్ష నొసంగిరి. ఇట్లే పెక్కురు భారతీయులు నేటాలునుండి ట్రాన్సువాలున బ్రవేశించి కారాగృహమును వరించిరి. చెఱసాలలు నిండిపోయినవి. గాంధిజీనిగూడ మరల చెఱగొనిరి. శిక్షా కాలము పూర్తియగుటచే స్వేచ్ఛఁ బడసెను.

౪

న్యూకాసిల్ నగరమునొద్ద బొగ్గుగనులు గలవు. అందు కరారుకార్మికులు పనిచేయుచుందురు. వారందరు భారతీయులు. కరారుకార్మికులు మూఁడుపౌనుల పన్ను చెల్లించవలసి యుండెను. అది వారికి దుర్భరమయ్యెను. తుదకు వారు సమ్మె చేసిరి. ఫోనిక్సునందున్న గాంధిజీ వెంటనే యటకుఁజేరెను. కార్మికులనందఱను చార్లెసుటవునను చిన్నగ్రామమునఁ జేర్చెను కాని యచ్చట వారికి వసతినొసంగుట మిగులప్రయాసముగనే యుండెను. స్త్రీలు బాలికలు గృహములం దుంచఁబడిరి. తక్కిన వారాకాశముక్రిందనే శీతుబాధకును, ప్రచండాతపబాధకును నోర్చి నిలచిరి.

కార్మికులసంఖ్య క్రమముగా హెచ్చెను. వీరి నందఱను ట్రాన్సువాలులోనికిఁ బ్రవేశపెట్టినచోఁ దప్పక కారాగారములందు జేర్చవచ్చునను నూహ గాంధిజీకిఁ గలిగెను. ప్రయాణ

సన్నాహములు గావించిరి. పయనమయిరి. ట్రాన్సువాలు సరిహద్దునందున్న వాల్క్రస్టు ప్రవేశించిరి. రక్షకభటులు వారిని నిరోధింపజాలకపోయిరి. శాంతిసైనికులు ముందునకుఁబోయిరి. గాంధిజీని నిర్బంధించి న్యాయస్థానమునకుఁ గొనిపోయిరి. గాంధిజీ జామీన్ మీఁద విడుదలచేయఁబడెను. ఇట్లే రెండు మూఁడు పర్యాయములు గాంధిజీని బంధించి జామీనుపై విడుదలచేసిరి. తుదకు నాల్గవతూరి గాంధిజీని గొనిపోయి ఖైదుచేసిరి. కొలఁదికాలములోనే సత్యాగ్రహవీరులను గనులకార్మికులను బంధించిరి. అందఱు చెఱసాలలోఁ జేరిరి. కృతకృత్యులైరి.

ప్రభుత్వమువారు మఱియొక యుపాయము పన్నిరి. కార్మికులను న్యూకాసిల్ ప్రాంతమునందలి ఖైదులలోనుంచి ఖయిదీలుగానే వారిచే గనుల పనులు చేయింపఁగడంగిరి. నిరాకరించిన వారిని కొరడాలతోఁ గొట్టిరి. తన్నిరి. తిట్టిరి. నైచ్యమునకుఁ బాలుపరచిరి. నిర్దోషులగు వారిపైఁ బశుబల ప్రయోగము గావించుచుండుట ప్రపంచవిఖ్యాతమయ్యెను. దక్షిణాఫ్రికా ప్రభుత్వము ప్రజాదరమును గోల్పోయెను.

అట్టితఱి స్మట్సుసేనాని విచారణసంఘము నేర్పఱచెను. వారు సత్యాగ్రహసమర నాయకాగ్రణులను శీఘ్రముగ విడచిపెట్టుటకు సలహానొసంగిరి. గాంధిజీ మున్నగువారు మరల స్వేచ్ఛనొందిరి. గాంధిజీకి స్మట్సుసేనానికిని నుత్తరప్రత్యుత్తరములు జరిగెను. విచారణసంఘమున భారతీయుని నియమించు

టకుమాత్ర మంగీకరించలేదు గాని మిగిలినకోరికలను సమాద రాయత్తచిత్తమున స్వీకరించెను. గాంధిజీకి తృప్తిగలిగెను.

తాత్కాలికసంధి కుదిరెను. సత్యాగ్రహఖయిదీలు విడుదలచేయఁబడిరి. సత్యాగ్రహము తాత్కాలికముగ విరమింపఁబడెను. ట్రాన్సువాలు ప్రవేశనిరోధకశాసనము విరమింపఁబడినది. కార్మికులపై విధించు మూఁడుపౌనులపన్ను రద్దయ్యెను. ధృవపరచుకొనెడి నియమము తొలగింపఁబడెను. భారతీయుల పరిహారచట్టము గావింపఁబడెను.

"ప్రియమైన గాంధిజీ!

ప్రస్తుతమున్న హక్కులను గౌరవింతుము. న్యాయముగా వాని నమలుపఱుతుము, ఇది ప్రభుత్వోద్దేశ్యము.

ఇట్లు,

"జనరల్ స్మట్సు."

"ప్రియమైన స్మట్సు సేనానికి,

తమ లేఖయందినది. మన చర్యలలో మీరు చూపిన సహనమునకు, గౌరవమునకు కృతజ్ఞుఁడ.

ఇట్లు,

మో. క. గాంధి."

# చాంపరాను సత్యాగ్రహము

## బాబూ రాజేంద్రప్రసాద్.



"గౌరవనీయులగు సర్. చార్లెస్ బేలే దొరవారి దివ్య సముఖమునకు

చాంపరానుజిల్లా మాజాస్ఫీనహారా, పరశురామ్‌పూర్, రాపాలియా, జమునియానసీబా, ఇబ్రిహీమ్‌పుర్ వర్‌సాని గ్రామస్థులము, రైతులమునగు మేము మాజిల్లాకు తమరు విచ్చేసిన సందర్భమున మా హృదయపూర్వకము, రాజభక్తి పూరితమునగు స్వాగతము నొసంగుచున్నాము. తమరాక వలన మా మండలమున శాంతిసౌఖ్యము లభివృద్ధినొందఁగల వని యాశించుచున్నాము.

మాగ్రామములు వర్‌సాని నీలిమందు కంపెనీవారి కౌలులోనున్నవి. ఆఫ్యాక్టరీవారి యమానుష దౌర్జన్యకృత్యములకు గుఱియై, మా భూస్వామ్యములను శాశ్వతముగ గోలుపోయి, దుర్భరజీవితములను మేము గడపుచున్నాము. ఘనతవహించిన తమ యాగమనమువలన భవిష్యత్తున మా పరిస్థితులు చక్కఁబడునని విశ్వసించుచున్నాము.

కౌలుదారులీమండలమునకు నీలిమందు తయారుచేయు దృఢనిశ్చయమున విచ్చేసిరి. మా తాత తండ్రులనాఁటినుండియు

మేము మా సారవంతములగు భూములను నీలిమందుపంటకు బలవంతముమీఁద నొసఁగుచుంటిమి. ఇది మిక్కిలి యన్యాయము. ఆత్మవిరుద్ధముగ సత్తాలని పిలువఁబడు రైతులయొద్ద నుండి యక్రమములగు నొప్పందములఁగైకొని చట్టబద్ధ మొనరించుకొనుచున్నారు. మేముగాని మా పూర్వీకులుగాని యే మాత్రము ప్రతిరోధమును జూపినను మేము పరిష్కారమును బొందియుండెడివారమే. కాని మాజీవనమును, గౌరవమును కాపాడుకొనుట కవ్విధమున జేయఁజాలమైతిమి.

శాంతిచేకుఱునను పేరాసమెయి మఱికొన్ని దుర్గుణములకు లోనుగావలసినవారమైతిమి. కాని యా శాంతిమాత్రము గగనకుసుమమేయయ్యెను.

దురదృష్టవశమున కర్మాగారములందును, విపణివీధులయందును నీలిమందు ధరను గోలుపోయెను. పెక్కు కర్మాగారములాపంటను బండించు నుద్దేశ్యమును విడనాడెను. అందు మా ఫ్యాక్టరీయొకటి. ఈ ధరల మాంద్యమువలన దుష్టఫలితము లేర్పడినవి.

ఫ్యాక్టరీ యిపుడు మాయొద్దనుండి నష్టపరిహారముకోరుచున్నది. దానివలన 'బైగా'కు పదునారు రూప్యములన్నర చొప్పున పరిహారము. అనఁగా బైగాకు రెండురూపాయల పావలా హెచ్చుశిస్తును చెల్లించవలసియుండెను. దానివలన మేము దివాలా తీయుచుంటిమి.

ఈవసూలు మా తలకుమించిన బరువు. అందుచే పన్ను చెల్లించుటకు శక్తిఁజాలక సహజముగ నయిష్టము చూపినతఱి

మా పేదతనమును, క్లిష్టపరిస్థితులను గమనింపక కర్మాగారాధిపతులు మమ్ము బలవంత పెట్టటయు పెక్కు తెఱంగుల మమ్ము బాధించుటయు పరిపాటిగా నున్నది.

మాపైఁ బ్రయోగించు నిర్బంధములు పలువిధములు. వ్యర్థ నేరములను మోపి న్యాయస్థానమునకు గొంపోవుచుండిరి. పసులకొట్టములనుండి పశువులను గొనిపోయి జరిమానాలతోఁ గూడ పన్నును జెల్లించినవెనుక విడచిపెట్టుచుండిరి. రైతులలోని స్వల్ప వివాదములను గోరంతలు కొండంతలుగాఁ జేయుచుండిరి. రైతులు ఫ్యాక్టరీపై దండెత్తుచుండిరను రిత్తనేరమును మోపి 'ప్యూనిటివ్ పోలీసుల'ను నెలకొల్పుచు జరిమానాలు వసూలుచేయుచుండిరి. ఒక్కొక్కతఱి ధన్గారులను ఫ్యాక్టరీ రక్షకదళమును మాపైకిఁ బంపుచుండిరి. ఇవ్విధముగ మా రైతులను లోంగదీయుటకు తోటలవారు గావింపని కుయుక్తి యొక్కటియు లేదు.

మా కష్టములను దెలుపుకొనుచు రక్షణకొఱకు బ్రార్థించుచు జిల్లాయుద్యోగికి విన్నపము గావించుకొనియుంటిమి. ఇట్టి విన్నపముల విచారింప నిరాకరించుచు వారు సక్రమముగ ఫ్యాక్టరీపై నభియోగమును దెమ్మనుచుండిరి. అంతట మేము పైయధికారికి విన్నవించుకొంటిమి. వారును నట్లే తెలిపిరి.

కాని వారు మా పరిస్థితులు గమనింపఁదగినవని కొంత దాక్షిణ్యమును గనుబఱచిరి. కాని మా కెట్టిప్రయోజనమును జేకుఱలేదు. మాండలికోద్యోగికడ మేము విన్నవించుకొనిన

యభియోగములు సరియైనవికావను నెపమునఁ ద్రోసివేయఁ బడుటవలన మేము నోరుమూసికొనుటయేగాక ఫ్యాక్టరీవారి వాంఛితము లెంతకఠినమైనవి, యన్యాయమైనవి, వినాశకరమైనవి యైనను నెరవేర్పవలసి యుండెను.

మీరాక మాకు ధైర్యమును జేకూర్చినది. మాదుర్దినములీనాటితో నంతమయ్యెనుగదాయను సమ్మోదముతో తమ ఘనమున కీవిజ్ఞప్తిని నివేదించుకొనుచున్నాము. పైనఁ బేర్కొనఁబడిన యక్రమ వసూలును ఫ్యాక్టరీవారు నిలుపుదలచేయగలందులకు కలెక్టరుగారిచే నుత్తరువు లిప్పింపఁ దమఘనమునుగూర్చి ప్రార్థించుచున్నాము. ఇట్టి ఘనకృత్యములు గావించు తమకు భగవంతుఁ డాయురారోగ్యము లొసఁగుగాత!"

చార్లెదొరగారు చాంపరానుజిల్లాకు వచ్చినప్పుడు 1912 సంవత్సరము ఫిబ్రవరిలో రైతులొసంగిన స్వాగతపత్రిమిద్యది. అల్లే పెక్కుగ్రాముస్థులు తమకష్టములను నివేదించుకొనిరి.

ఆసమయముననే గౌరవనీయులగు బాబుబ్రజకిశోర ప్రసాదుగారు ఉన్నతశాసనసభయందడిగిన ప్రశ్నకు సమాధానమొసఁగుచు గౌరవనీయులగు మేక్ఫర్సన్ గారిట్లనిరి.

"రైతులకు భూస్వాములకు గలిగిన వివాదములను గూర్చి చాంపరాను రైతులు పంపుకొనిన విజ్ఞాపనములు ప్రభుత్వమునకుఁ జేరినవి. వానినిగూర్చి విచారణలు జరుపవలసినదిగా స్థానికాధికారులకుఁ దెలుపఁబడెను. అందఱియొద్దనుండి రిపోర్టులింకను జేరలేదు. కొన్ని యభియోగములు ధృవపడిన

సందర్భమున వారికష్టములు దొలఁగింప స్థానికాధికారులు పూనుకొనిరి. సంపూర్ణమగు ప్రకటనకొఱకు నిరీక్షించుచున్నాము. కొలఁది కాలములో భూమిశిస్తు విధానమును గూర్చి ప్రభుత్వము విచారింపనున్నది. కావున ప్రస్తుతవిషయములగూర్చి విచారణ మనవసరమని యభిప్రాయపడుచున్నాను.”

1913 సంవత్సరమున హార్డింజి ప్రభువు పాట్నా ఉన్నత న్యాయస్థానమునకు శంకుస్థాపనము చేయవచ్చినతఱి భూస్వాములు స్వాగత పత్రమును సమర్పించిరి. దానికిఁ బదులు చెప్పుచు, ఈనాఁడు ఉత్తర బీహారు మండలములందు రైతులకును, భూస్వాములకును సంబంధములు సంతృప్తికరముగా నున్నవని వక్కాణించెను.

1914 సంవత్సరము ఏప్రియలు పదియవ తేదిని బీహారు రాష్ట్ర మహాసభ జరిగెను. బాబుబ్రజకిశోర ప్రసాద ధ్యక్షత వహించి తన యుపన్యాసమున నిట్లు ఘోషించెను.

“ఈ దేశములోని యున్నతాధికారులందఱు తమకు తోటయజమానులు స్వాగత ప్రతములు సమర్పించినపుడు ప్రత్యుత్తర మొసంగుచు వారి సేవను నుగ్గడించుచున్నారు. ఇందులకుఁ దోటయజమానులపై నాకసూయలేదు. కాని వారు నిజపరిస్థితుల గమనింపలేదని తలఁచెదను. రైతులతోడి గావించు వ్యవహారములందు క్లిష్టపరిస్థితులను గలిగించుచుండిరని వారు తలంచుటలేదు. దిక్కులేని గ్రామీణులు దుర్భరబాధా క్రాంతు

లగుచుండుట సామాన్యదృశ్యము. భుస్వాముల వలన రైతులకు గలుగుచున్న నిర్బంధములు వర్ణింప నలవికాదు. సత్త్రాలకు సంబంధించినంత వఱకు ఫ్యాక్టరీలలోనే రిజిస్ట్రేషను ఆఫీసులను గూడ నుంచుట విడ్డూరము. ఇట్టి నేరముల విచారించ ప్రభుత్వము వారధికార, అధికారేతర సభ్యులతో గూడిన చిన్న కమిటీని నియమింప నేల జంకవలెనో నే నూహింపజాలకున్నాను. బహిరంగ విచారణము ప్రభుత్వము చిక్కులుపాలు గావలసి వచ్చునని నేను హెచ్చరించుచున్నాను.”

అంతటితో రాష్ట్రీయ సంఘమొక తీర్మానమును గావించిరి. అందు వారు సర్కారు వారిని విచారణ సంఘమును నెలకొల్పుమని సలహా నొసంగిరి. కాని ప్రభుత్వమా తీర్మానమును నిర్లక్ష్యమొనర్చెను. కలకత్తా యందలి అమృత బజారు పత్రిక, భారతమిత్ర, కాన్పూరు నందలి ప్రతాప్, అలహాబాదులోని అభ్యుదయ మున్నగు పత్రికారాజము లెడనెడ చాంపరాను రైతుల కడగండ్లను కన్నులకు గట్టినటుల ప్రజల దృష్టి పథమునకు దెచ్చుచునే యుండెను. మీఁదు మిక్కిలి బాబుబ్రజకిశోర్ శాసన సభల యందంతటంతట ప్రభుత్వమును హెచ్చరించుచునే యుండెను. చాంపరానులోని రైతుల యసంతృప్తియను జ్వాల ప్రజ్వరిల్లి ప్రభుత్వముపై కెగయక పోదని నిశ్చయముగ చాటెను.

ఇంతలో కాలచక్రమున వత్సరము తిరిగివచ్చెను. 1915 సంవత్సరము ఏప్రియల్. ఈయేఁడు రాష్ట్రమహాసభ చాప్రాలో

సమావేశమయ్యెను. బాబునందకిశోర్ లాల్ అధ్యక్షుఁడాయెను. అతఁడును కరుణారసపూరితముగ శ్రోతల హృదయములు కరఁగునట్లు చాంపరాను రైతుల యిక్కట్టులను వర్ణించెను. మరల సభవారు విచారణ సంఘ నియామకమును గూర్చి తీర్మానము గావించిరి.

ఆమాసముననే శాసన సభాసమావేశము కూర్పఁబడెను. అందు బాబువ్రజకిశోరుఁడు తీర్మానము నొక దానిని ప్రతిపాదించెను.

"చాంపరాను జిల్లాలోని రైతులకు, తోటయజమానులకు మధ్యనున్న సంబంధములను తత్క్షణమే పరిశీలించి, తన్నివారణ సాధనముల కనుఁగొనఁగలందులకు నధికార, యధికారేతర సభ్యులతోఁ గూడిన విచారణ సంఘము నొక దానిని నియమించ వలసినదిగా సభాయుక్తుఁడగు శ్రీ గవర్నరుగారికి సభవారు సలహా నొసఁగుచున్నారు"

సర్ చార్లెస్ దొరవారీ తీర్మానమునకు సమ్మతి నొసంగరని వేరుగఁ జెప్పఁ పని లేదు. మరల వెనుకటి పాటనే పాడిరి. తోటయజమానుల పక్షమున వారి సంఘ కార్యదర్శియగు ఫిల్ గేటు గారా ప్రతిపాదనమును ప్రతిఘటించిరి. ప్రభుత్వ సభ్యులు వారి పాటకు బ్రక్క తాళము వేయుట సాజమే యగుఁగాక, యధికారేతర సభ్యులును వారి ననుసరించుట దేశదౌర్భాగ్య స్థితికిఁ జింతించవలసిన తరుణము. చాంపరాను విషయ మేమాత్ర మెఱుంగని యా సభ్యులంతటితో నాగక

తీర్మానము నుపసంహరించు కొనుమని నుపదేశించిరనిన నింకఁ జెప్పవలసినదేమి? కాని వజ్రసంకల్పుఁడగు ప్రజకిశోరుఁడు సెటిల్‌మెంటు ఆఫీసరులు గావించిరని దెలుపుచున్న విచారణ సంగ్రహమును బహిరంగ పరచిన యెడల తన తీర్మానము నుప సంహరించు కొందుననియెను. కాని ప్రభుత్వమంగీకరింప లేదు. తుదకు తీర్మానము మాత్రము నెగ్గలేదు.

ఈవిషయములవలన చాంపరాను జిల్లాలోని రైతులెంత దురంతవంతల పాలయిరో, యేవిధముగ నిస్సహాయ స్థితియం దుండిరో తెలియనగును.

చాంపరానను నది బీహారు రాష్ట్రమునందు పశ్చిమో త్తరమున నున్న యొక మండలము. ఉత్తరమున హిమవన్నగము, పశ్చిమమున గోరఖ్పూరుజిల్లా, దక్షిణమున సారాన్ జిల్లా, తూర్పున ముజఫర్‌పూర్ జిల్లాలు సరిహద్దులుగా గలిగి యుండెను. ఆజిల్లాయందు సాలగ్రామి లేక గండకియను నామాంతరములుగల నారాయణీనది ప్రవహించుచుండెను ఇంకను ననేకములగు చిన్నినదులేగాక బ్రిటిషుప్రభుత్వము వారు త్రవ్వించిన త్రివేణికాలువయొకటి గలదు.

ఆమండలమునందు భూమి రెండు విధములు. ఉత్తర భాగము పల్లపునేల వరిపంటకనుకూలించు భూమి. దక్షిభాగము మెట్టభూమి. అందు మొక్కజొన్న, గోధుమ మున్నగు మెట్ట పంటలు మాత్రము పండుచుండును.

చాంపరాను జిల్లాలో రెండు పట్టణములు మాత్రమే గలవు. ఒకటి మోతిహారి. అది జిల్లాకు ముఖ్యపట్టణము. రెండవది బెట్టియానగరము. అది బెట్టియామహారాజు వాసస్థానము. పూర్వము వర్తకమునకు కేంద్రస్థానము. మిగిలినవన్నియు గ్రామములే. అవి రమారమి మూడువేలుండును. ఆ జిల్లావైశాల్యము 3531 చదురపుమైళ్లు. జనసంఖ్య ఇరువది లక్షలకు దరిదాపులనుండును. అందు హిందువులసంఖ్య హెచ్చుగానుండెను. మహమ్మదీయులుగూడ కొలదిగగలరు. బెట్టియాలోక్రైస్తవుల జనసంఖ్య హెచ్చుగాగలదు. హిందువులలో థారులని పిలువబడు ఆదిమనివాసులు కొందఱుగలరు. హిందూ మహమ్మదీయుల భాష భోజపురియను పేరం బిలువఁబడు హిందీ.

౨

కాలచక్రము మఱియొకమారు చుట్టివచ్చెను. 1916వ సంవత్సరము డిసెంబరు నెల. లక్నోనగరమున మహోత్సవము. భారతజాతీయ సభాసమావేశము. పల్లుప్రాంతములనుండి యిరువదిమూఁడువందల ప్రతినిధులు నగరమును నలంకరించిరి. జనుల కోలాహలము చెప్పనలవిగాకుండెను.

మహానాయకు లరుదెంచిరి. లోకమాన్యతిలక్ మహాశయుఁడు తన యనుచరబృందముతో నట కరుగుదెంచెను. సూరతుకాంగ్రెసున విభేదములు పొడసూపిన పిమ్మట మరల

యీ మహనీయుఁడు జాతీయసభలకు వచ్చుట కిదియే ప్రథమ పర్యాయము. మఱియు మదరాసునుండి అనిబిసెంటమ్మగారు విచ్చేసిరి. దక్షిణాఫ్రికాయందు సత్యాగ్రహ సమరమును దిగ్విజయముగానడిపి యఖండ యశోవిరాజితుఁడైన శ్రీ మహాత్మా గాంధిజీ కూడ గుజరాతునుండి తన కుమారునితో నేతెంచెను.

దక్కను, సింధుప్రాంతములనుండి ప్రతినిధులు పెక్కురు వచ్చిరి. మదరాసు, గుజరాతు, మధ్యమాగాణముల ప్రతినిధులుగూడ తగుపాటి గలరు. బెంగాలునుండి వచ్చిన ప్రతినిధుల సంఖ్య యధికము. బీహారునుండియు తమ కష్టముల నివేదించుకొను నుద్దేశ్యమున నధికసంఖ్యాకులగు ప్రతినిధులరుదెంచిరి. బీహారునుగూర్చి రెండు తీర్మానములు మహాసభలో ప్రవేశపెట్ట సంకల్పించిరి. ఒకటి పాట్నా యూనివర్సిటీ బిల్లునకు సంబంధించినది. మఱియొండు చాంపరాను లోని తోటయజమానుల, రైతులకు సంబంధించినది.

ఈ తీర్మానములు విషయనిర్ణయ సభవారి దృష్టికిఁ దెచ్చుటకుముందు బీహారు నివాసులు మహాత్మాగాంధి, పండిత మదనమోహనమాలవ్యా మున్నగు నాయకాగ్రణుల సందర్శించిరి. మఱునాఁటి మహాజనసభయందు బాబు వ్రజకిశోర ప్రసాదు తీర్మానము నిట్టుల ప్రతిపాదించెను.

"ఉత్తర బీహారమునందు యూరోపియను తోట యజమానులకును, నీలిమందు పండించు రైతులకును గల వివాదమునుగూర్చి పరిశీలించి, కష్టనివారణమునకుఁ దగు సాయము

చేయుగలందులకు నధికార, యధికారేతర సభ్యులతోఁగూడిన విచారణసంఘము నియమించుటకు ప్రభుత్వమువారికి సభవారు గౌరవపురస్సరముగా విన్నవించుకొనుచున్నారు." చాంపరాన్‌జిల్లా కాంగ్రెసుప్రతినిధియగు పండిత రాజకుమారశుక్లా తన మండలములోని నీలిమందు రైతుల దుర్భర దురంత దుస్థితిని సభికుల హృదయముల ద్రవించునటుల వర్ణించుచు తీర్మానమును బలపరుప నయ్యది ముక్తకంఠముతో నంగీకరింపఁబడెను.

సమావేశానంతరము బీహారువాసులు గాంధిజీవెంట కాన్పూరువఱకును వెళ్ళి తమ కష్టములగూర్చి మొఱవెట్టుకొని యొక్కపరి సనుదెంచి న్యాయముగ కనుగొని, తన్నివారణోపాయములఁ జెప్పి రక్షించుఁడని ప్రార్థించిరి. సహజ దయాశీలుఁడగు నమ్మహాత్ముఁడు వారి హృదయావేదనను గుర్తించి కడుంగడు దుఃఖాన్వితుఁడై యొకటి రెండు మాసములలో నట కరుదెంచి తప్పక వారి కష్టములఁ బాల్గొందునని వాగ్దానము గావించెను. మహాత్ముని వచనమును గైకొని, కొంత పరిశ్రాంతినొంది, యమ్మహనీయుని సదాగమన మెప్పుడాయని నిరీక్షించుచు, నాశాపూరితస్వాంతముల దినముల లెక్కిడుకొనుచు బీహారువాసులు వసించుచుండిరి.

ఇవ్విధమున ప్రతీక్షించుచుండగా 1917 సంవత్సరము ఏప్రియలు 3 వ తేదీన పండితరాజకుమారశుక్లాకొక తంతివార్త వచ్చెను. అందు మహాత్ముఁడు కలకత్తా వచ్చుచున్నటులను

తన నచట కలిసికొనవలసినదిగను శుక్లా కోరబడెను. అపరిమితానందమున కలకత్తాకరిగి గాంధిజీని సందర్శించెను. అయ్యిరువురును తొమ్మిదవ తారీఖున బయలుదేరి పదియవ తేదికి పాట్నా చేరిరి. శుక్లాగా రమ్మహాత్ముని సరాసరి బాబు రాజేంద్రప్రసాదుగారి సదనమునకు గొంపోయెను. కాని యజమాని గృహమున లేడు. ఒక నౌకరుమాత్రముండెను. ఆతఁడు గౌరవనీయుఁడగు నతిథి తమ గృహమున కరుదెంచెనని తలంపక యాతఁడెవ్వరో సామాన్య మానవుఁడనుకొనెను. మహాత్ముఁడట కొండొకకాలము విశ్రమించెను. ఇంతలో వారి యాగమనవృత్తాంతము నగరమున వ్యాపించెను. మజహారాల్ హక్కుగారు విచ్చేసి యతిథిని తమ నివేశమునకుఁ గొంపోయెను. గౌరవనీయుఁడగు బాబుకృష్ణసాహె గూడ విచ్చేసి గాంధిజీని జూచెను.

ఆ సాయంతనమే ముజఫర్‌పురమునకు బయనమై రాత్రి కాపట్టణమును జేరెను. తన రాకను ముందుగనే యచటి కళాశాలాచార్యుఁడగు జె. బి. కృపాలనీగారికి తంతీమూలమున దెలియఁజేసియుంట నయ్యాచార్యుఁడు తన శిష్యగణంబుతో మహాత్మునికి స్వాగతమొసంగుటకు స్టేషనున కరుదెంచెను. అంతకుముందిరువురకు ముఖపరిచయము లేకునికి పండితశుక్లాగారు వారల నన్యోన్య మెఱుకపఱచిరి. జనులు కోలాహలముతో నాతనికి స్వాగతమొసఁగి బండిలో నాతనిని గొనిపోయిరి. ఆ రాత్రికి మహాత్ముఁడు కృపాలనీ యింట నాతిథ్యము స్వీకరించెను.

జె. యం. విల్సన్ తోటయజమానుల సంఘ కార్యదర్శి. మహాత్ముం డాయనతో మరుదినమున సంప్రతించెను. తాను వచ్చినపనిని దెల్పెను. తత్కార్య సాఫల్యమునకు సహాయకుండుగ నుండుమని యభ్యర్థించెను. కాని యా పెద్దమనుష్యుఁడు వ్యక్తిపరముగా తనకు వీలైనంత మేరకు సాయ మొనర్తుననియు సంఘపక్షమున సహాయము నొనర్పఁ జాలననియు మెల్లగ వివరించెను.

ముజఫరునగర న్యాయవాదులు పెక్కండ్రు గాంధిజీని సందర్శించి చాంపరాను రయమున పయనముగండని ప్రోత్సహించిరి. మహాత్ముఁడు సమ్మతించి సంసిద్ధుఁడయ్యెను.

గాంధిజీ తిర్హూతు డివిజన్ కమీషనరైన యల్. యఫ్. మోర్షీదు గారికి తన రాకయును, వచ్చినపనియు నివేదించుచు లేఖవ్రాసి వారి దర్శనము నొకపరి యపేక్షించెను. కమీషనరుగారి యనుమతిపై మరుసటిదినమే వారి సమావేశము జరిగెను. గాంధిజీ యాగమనము తన కంగీకార యోగ్యము కాదనియు, ప్రభుత్వమువారే చాంపరానులోని వ్యావసాయక వివాదముల విచారింప. నిర్ణయించిరనియు వాక్రుచ్చెను. అంతేగాక గాంధిజీ యచటకు వచ్చుట నిష్ప్రయోజనమనియు, ఆతడెంత త్వరితముగ బీహారును విడచిన యంత క్షేమకరమనియు నుడివెను. పైపెచ్చు తాసీవిషయమున రవ్వంతయు సహకారము చేయఁజాలననియెను. ప్రజలయొద్దనుండి తనకనేక లేఖలందినవనియు, వారు తమ ప్రదేశమునకువచ్చి స్వయముగా

పరిస్థితుల గమనింపఁ దనను గోరిరనియు గాంధిజీ ప్రత్యుత్తర మిచ్చెను గాని యధికార మద్మదాంధుండును స్వజాతీయ పక్షపాత చిత్తుఁడును, దురాగ్రహోదగ్ర స్వాంతుఁడును నగు నా యధికారి కాపలుక్కులు చెవిదూరలేదు. కార్యదర్శి విల్సను ముజఫర్ పురపు కలెక్టరుగూడ చాంపరానునకు గాంధిజీపోవుట నిరర్థకమనియు, ననిష్టదాయకమనియు, సలహా నొసంగిరి.

ఇదియంతయు గాంధిజీకి విపరీతముగఁదోచెను. తానేల చాంపరానేగరాదు? అచ్చటి పరిస్థితులు విషమింప తనరాక యెట్లు కారణమగును? చిత్తమును విచారమార్గమున జేర్చెను. ఎంత యోజించినను తాను చాంపరానున కేగుటయే కర్జమగునని యాతని యంతరాత్మ ప్రబోధించెను. మఱియు వారిట్లడ్డు పెట్టుటలో నేదియో రహస్యముండకపోదని యూహించెను. ఎట్టకేలకెన్ని యవాంతరములు దాపురించినను చాంపరానున కేగవలయునని కృతనిశ్చయుఁడాయెను.

ఏతత్ప్రయాణ ప్రయత్నమున గాంధిజీ నిమగ్నుఁడై యుండెను. మునుముందు లక్నోకువచ్చిన కాంగ్రెసుప్రతినిధుల యొద్ద తనను చాంపరాను వచ్చి విచారింపవలెనను కోరు లేఖ నొకదానిని బుచ్చుకొనెను. దానితో తానొక లేఖను జతపరచి ప్రభుత్వమునకుఁ బంపెను. తాను గౌరవకరమగు శాంతి నభిలషించుచుంటినని పేర్కొనెను. తనకు వచ్చిన లేఖయందలి యాదార్ఢ్యమును విచారించుటకే యేగుచుంటినని వ్రాసెను,

సాయంసమయమున పరిసర ప్రాంత కుగ్రామమునకు గాంధిజీ జనియెను. అచటనున్న కొన్ని పేదకొంపల కేగి వారితో హృదయమిచ్చి మాటాడెను. ఇట్టి పేదల పరిస్థితులు చక్క బడినపుడే స్వరాజ్యమును బడయగలుగుదుమని నాఁడు వక్కా ణించెను. తిరిగి రాత్రికి ముజఫరుపురమునకుఁ జేరెను.

ఆరాత్రి భోజనానంతర మచటి జనులతో సిష్టాగోష్ఠి గావించెను. ఆసమయమున దక్షిణాఫ్రికా సత్యాగ్రహ యుదం తమునందలి కొన్ని ముఖ్యఘట్టముల వారికి వినిపించి తనను నిర్బంధించినతఱి నొకరితరువాత నొకరెవ్విధమునఁ దగస్థానము నాక్రమించిరో విశదపఱచెను. పరమానంద సంభరితాంత రంగులై, మృదు మధుర వాగ్ఝరీ పరిప్లావిత మానసులై, ఏతత్కథాశ్రవణ కుతూహలరసపాన మత్తచేతస్కులై నచటివా రెల్లరు తనివిసన వారివాక్యము లాలకించిరి. ఉత్సాహావేశ ములు వారి నావరించెను.

అచట చేరినవారెల్లరకుఁ దనను ప్రభుత్వము నిర్బం ధించుననియు, అట్టిపని చాంపరానులో జరుగుట తనకు వాంఛ నీయమునియు, అందులకై యచటికి సత్వరముగ నేగ సంక ల్పించితిననియు వారెల్లరకు శ్రుతపరచెను.

చాంపరానువాసుల భాష గాంధిజీకి రాదు. అందువలన దుబాసీలు (Translators) కావలెనని గాంధిజీ కోరెను. ధరణీ ధరుఁడు, రామనవమిప్రసాదు అను వారిరువురా కార్యమునకు నియుక్తులైరి. వారిరువురు వెంటరా గాంధిజీ మధ్యాహ్న

కాలపు బండిలో మోతిహారికిఁ బయనమయ్యెను. ప్రప్రథమమునుండియుఁ దనను బ్రభుత్వము నిర్బంధించునని తలఁచుచుండెను. అందులకే వలసిన వస్తువులమాత్రము చేతిసంచిలో నుంచుకొని మిగిలినసామానును వేరుగ నొకట్రంకులో నుంచెను. జనులనేకులు స్టేషనువఱకును వచ్చి గాంధిజీని వీడ్కొలిపిరి.

మోతిహారి నగరమును జేరగనే జనులు తండోపతండములుగ మహాత్ముని సందర్శనోత్సాహమున నాతఁడు వసించియున్న గోరకనాథప్రసాదుని గృహమునకుఁ జేరుచుండిరి. ప్రభుత్వోద్యోగులును గొందఱు చనుదెంచిరి. కాని యచట పోలీసులుండుట గమనించి మెల్ల మెల్లఁగ జారుకొనిరి. రైతుల యొద్ద వాఙ్మూలములు గైకొనుట కొకదినమును నియమించి, యింతలో జాసౌలిపత్తి యనుగ్రామమును జూచిరా మహాత్ముఁడు నిశ్చయించుకొనెను.

అది వైశాఖమాసము. ఖరకరుఁడు నిజకరసహస్రమును జీవులపైఁబరపి వారి శక్తిసామర్థ్యములఁ బరీక్షించుచుండెను. ఆ మండుటగ్గికిఁ దోడు వడగాడ్పులును జెలరేగినవి. అపైని సుకతుపానులు. పేదల కష్టముల విచారింపఁబోవు నీపెద్దల చిత్తస్థైర్యమున కగ్నిపరీక్షయోయన సూర్యకిరణసంతప్తసైకత రేణునిచయము పవమానోద్ధతమై వారిదేహములఁదాఁకి బాధాజనకమయ్యెను. ధీరులు విఘ్నములను సరకుగొనరుగదా! గాంధిజీకిఁబహిర్దాహముకంటె దీనులదుస్థితిఁ దొలగింపవలెనను నావేదనాపూరిత యంతర్దాహ మెక్కుడుగనుండెను. సజ్జనులు తమకార్యమును బరిత్యజించియు బరార్థప్రాపకు లగుదురుగదా!

మార్గమధ్యమున వారు చాంద్రాహియాగ్రామము జేరిరి. అచటి స్థితిగతుల విచారింప గాంధిజీ మనసుపడెను. గాని గ్రామస్థులందఱు ఫ్యాక్టరీలోఁ బనిచేయుట కరిగియుంట వలన నాతని కది సాధ్యముగాకుండెను. కర్మాగార సంబంధీకుఁ డగు నొకఁడు వారికిఁ దటస్థించెను. ఆతఁడు ఫ్యాక్టరీయజమానుని బొగడుచుండెను. ఇంతలో బైసికిలుపై నొకవ్యక్తి వారి కెదురై వారిచెంత నిలచెను. గౌరవపురస్సరముగా నభివందన మాచరించి కలెక్టరు గాంధిజీ నొకపరి తనయొద్దకు రమ్మని కబురంపెనని నుడివెను. ఆవ్యక్తి పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరని వారు వెంటనే గ్రహించుకొనిరి. గాంధిజీ పరిస్థితు లర్థముచేసి కొనెను. తన సహచరులతోఁ బ్రయాణము సాగింపుడనియు, జానౌలుపత్తి చేరగనే నిర్ణీత కార్యక్రమమును కొనసాగింపుఁ డనియు కోరెను.

ఇంతలో నాఇనస్పెక్టరు కంచరము నొకదానినిఁ దే నందు గాంధిజీయెక్కి మోతిహారీనగరమునకు బయనమయ్యెను. వారి సహచరులు వారిప్రయాణమును సాగించుచునేయుండిరి. వారు ధైర్యమును విడనాడలేదు.

గాంధిజీ మోతిహారి చేరగనే యాతనిపై ఐ. పి. సి. 144 సెక్షను ననుసరించి వెంటనే యాజిల్లాను విడచిపోవలెనని యాంక్ష కలెక్ట రొసంగెను. దానికిఁ బ్రత్యుత్తరమును మండలాధిపతికి గాంధిజీ వెంటనేపంపెను. జిల్లాను వీడిపోననియు, తచ్ఛాసనధిక్కార నేరమునకు శిక్ష ననుభవింతుననియు నాతఁడు

పేర్కొనెను. ఈవార్తను నతిశీఘ్రముగ పోలక్, మాలవ్యా, రాజేంద్రప్రసాదు మున్నగు నాయకులకుఁ దెలియఁజేసెను. సి. యఫ్. ఆండ్రూసు మహాశయుని వెంట నేరమ్మని తంతినంపెను. తన తదనంతరము కార్యరంగమున జేయువలసిన పనులను సూచించెను.

గాంధిజీ వెంటనరిగిన ధరణీధర, రామనవమీప్రసాదులు గమ్యస్థానమునుజేరి, యచట గొందఱివలన వాఙ్మూలములఁగైకొని మోతిహారికిఁ దిరిగివచ్చిరి. ఇట గాంధిజీపైఁ జరుపఁబడిన విషయము నెఱింగిరి.

నిర్ణయింపఁబడిన గడువుదిన మేతెంచుడు రైతులనుండి వాఙ్మూలములు (Statements) తీసికోనారంభించిరి. పోలీసు సబ్-ఇన్స్పెక్టరుగూడ నటకేతెంచి తొలుదొల్తను పరోక్షము నను పిమ్మటఁ బ్రత్యక్షముగను వాఙూలములిచ్చిన రైతుల పేర్లను వ్రాసికొనుచుండెను. అయినను వచ్చెడి జనప్రవాహమున కంతములేకుండెను. మహాత్ముఁడు తనకు జైలుశిక్ష తప్పదని గ్రహించియుంట నతిశీఘ్రగతిని కార్యము పరిపూర్తిచేసికో దలఁచుచుండెను.

ఇంతవఱకు శాసనధిక్కార నేరమున కాతనిపై నభియోగము తేఁబడలేదు. అందుచే గాంధిజీ పార్సాసిగ్రామమునకు బోనేగదలచితినియుఁ, దానెద్దిచేసినను బహిరంగముగఁ జేయసంకల్పించితిని గాన సర్కారుద్యోగిని వెంటనంపుడనియు కలెక్టరునకు లేఖవ్రాసెను. వెంటనే కలెక్టరు ఐ. పి. సి.

188 సెక్షను ననుసరించి నేరమును మోపెను. పిమ్మట సబ్ డివిజనల్ ఆఫీసరుగారియెదుట హాజరుకావలసినదిగా తాఖీదును బంపిరి.

ఈవార్త యందగనే గాంధిజీ తనయనుచరులతో "నేను జైలునకేగినవెనుక మీరేమి చేయఁదలచితిరి?" అనిప్రశ్నించెను.

"మీరు జైలునకు వెళ్ళినవెనుక నేనీపనిని సాగింతును. నాపైనను హిందూశిక్షాస్మృతిలోని 144 వ సెక్షను ప్రయోగించిన, మఱియొకని నాస్థానమున నియమించి నేను జిల్లాను విడచిపోదును. ఇవ్విధముగఁ గొంతకాల మీయుద్యమము నడుపగలదు." అని ధరణీధరుఁడు ప్రత్యుత్తరమొసఁగెను. అయ్యది గాంధిజీకి సంతృప్తిని గలిగింపలేదు. గాంధిజీ నాఁటి రేయి విశ్రాంతి నెఱుఁగక పనిచేసెను. న్యాయస్థానమున దాఁ జదువనెంచిన వాఙ్మూలమును దయారుచేసికొనెను. మఱి కొన్ని యుత్తరములవ్రాసి, తాను జైలునకు వెళ్ళినపిదప వానిని తపాలుపెట్టెలో వేయుమని సహచరుల కొసఁగెను.

తంతీవార్త చేరగనే రాజేంద్రప్రసాదు పాట్నాలోని రాజకీయవేత్తలను గలిసికొని చాంపరానులో నుత్పన్నమైన క్లిష్టసమస్యలగూర్చి చర్చించెను. వ్రజకిశోరప్రసాదునకు తంతి నంపెను. పోలకుమహాశయుఁడు పాట్నాకరుదెంచుచున్నటులు కబురునందికొనెను. ఆతఁడు వచ్చినవెంటనే మిత్రబృంద మొక యిష్టాగోష్ఠిసభను జరిపిరి. అందు పోలకు, రాజేంద్రప్రసాదు, ఇంకఁ గొందఱు మరుసటిదినము మోతిహారి కరుగవలెనని నిశ్చయించుకొనిరి.

1917 సంవత్సర ఏప్రియలు 18 వ తేది భారతేతిహాసమున ప్రాముఖ్యమగు దినము. నాఁడే హిందూదేశములో నొక మహావ్యక్తి బీదప్రజానీకముకొఱకు శిక్ష ననుభవింప సంసిద్ధుఁడయ్యెను. అదియే భారతస్వరాజ్య సంపాదన ప్రయత్నమునకు బీజములు చల్లిన దినము. ఆసేతుశీతనగమున గల భారతీయుల దృష్టులు చాంపరాను వైపునకు మరలింపఁబడినవి. 'సత్యమేవజయతి' యను సూక్తికిఁ బరీక్షాసమయము.

సరిగాఁ పావుతక్కువ పండ్రెండు గంటలకు మహాత్ముఁడు తన యిరువురనుచరులతోఁడ న్యాయస్థానమున కరుగ సమకట్టెను. త్రోవలో ననుచరులిరువురును దాముకూడ నాతని వెనుక జైలునకరుగ సంసిద్ధులమై యుంటిమని తెలిపినపుడు గాంధిజీ పరమానందభరితుఁడై 'ఇప్పుడు విజయము తథ్యమని తెలిసికొంటి' ననెను.

గాంధిజీ దర్శనమునకై న్యాయస్థానమున జేరిన జనసమూహము వారింపరానిదయ్యెను. అందులకై సాయుధ రక్షకదళమును నియోగించిరి. ప్రభుత్వన్యాయవాది గాంధిజీపై మోపఁబడిన నేరమును ఋజువుసేయు పొంతె శిక్షాస్మృతులఁ దిరుగవేసి సావధానుఁడై వచ్చెను. గాంధిజీ న్యాయస్థానమును జేరఁగనే న్యాయాధిపతి యిట్లనెను.

"నీవు న్యాయవాది నేర్పఱచుకొంటివా?"

"లేదు" అని గాంధిజీ తెలుపఁగనే చూపరులు తెల్లవోయిరి.

ప్రభుత్వ న్యాయవాది గాంధిజీపై గల యభియోగ మును జదివెను. వెంటనే గాంధిజీ తన వాఙ్మూలము నివ్విధిఁ జదివెను.

"న్యాయమూర్తి యనుమతితో నేనీ శాసనధిక్కారము నెందులకు సల్పితినో వివరించెదను. నా యభిప్రాయములో నియ్యది స్థానికాధికారులకు నాకు గల భేదాభిప్రాయమే యని యందును. ఈ ప్రాంతమునకు వచ్చుటలో నా ముఖ్యోద్దేశ్యము ప్రజాసేవచేయుటయే. నీలిమందు తోటల యజమానులు రైతులను సంపూర్ణముగ నణగఁద్రొక్కుచున్నటుల నాకుఁ జేరిన లేఖల పురస్కరించుకొని యందలి యాథార్థ్యమును నిచట గల యధికారేతరుల సహకార, సానుభూతులతోఁ గనుఁగొన వచ్చియుంటిని. ప్రజాశాంతిని భంగపరచు కోర్కి నాకులేదు. ఇట్టియెడ ప్రభుత్వము వారు నన్నపార్థము చేసి కొనిరి. ప్రథమమున నేను ప్రభుత్వచట్టముల నెదిరింపఁ దలంప లేదు. కాని నేనెవరిని సేవింపవచ్చితినో నట్టివారికి సేవచేయఁ జాలకుండుట నా యాత్మగౌరవమునకు హానియని తలంచినప్పు డివ్విధమున శాసనధిక్కార మొనర్పఁ బూనితిని."

ఇంతవఱకును గాంధిజీ నెదురువాదమును సేయునని తలఁచిన ప్రభుత్వన్యాయవాది నిర్విణ్ణుఁడయ్యెను. న్యాయ మూర్తికెని నేమిసేయుటకును బాలుపోవక నీవు నేరము చేసి తివా యని పృచ్ఛించెను. చెప్పవలసినదంతయు నిదఃపూర్వమే వచించితినెను. అది నీవు నేరము సంగీకరించినటుల స్పష్టము

గావించుటలేదని న్యాయమూర్తి తెలుపఁ దుదకు గాంధిజీ "నేను దోషినే" యని యంగీకరించెను.

న్యా. మూర్తి:-"నీవింతటితో నీ జిల్లాను వదలి మరల రానని వాగ్దానమిచ్చినయెడల నభియోగ ముపసంహరింపఁ బడును."

గాంధి:-"ఎన్నఁటికి నట్లు కానేరదు. ఇప్పుడే కాదు, జైలునకు వెళ్ళిన మరల వచ్చినవెనుక చాంపరానును నా నివాసముగాఁ జేసికొందును."

న్యాయమూర్తి నిశ్చేష్టుఁడై తీర్పును 3 గంటలకు జెప్పెదుననెను. ఈలోపున కలెక్టరు హేకాకు గాంధిజీని బిలువ నంపి మూఁడు దినములవఱకు గ్రామముల కరుగకుండుటకు గడువు వేసికొనెను. మహాత్ముఁడు సమ్మతించెను. న్యాయమూర్తియు 3 గంటల సమయమున వచ్చి తన తీర్పును మరి మూఁడు రోజులవరకు నాపియుంచితినని ప్రకటించెను. ఈ వార్త గాంధిజీ మిత్రులకు, జాతీయనాయకులకు, వార్తాపత్రికలకు వెంటనే విడుదల చేయఁబడెను.

18వ తారీఖున పాట్నానగరమునుండి పోలక్, హేక్, వ్రజకిషోర్ ప్రసాదు, అనుగ్రహనారాయణ, శంభుశరన్, రాజేంద్రప్రసాదు గారలు మోతిహారికిఁ జనుదెంచి, గాంధిజీని గాంచిరి. జరిగిన యావద్వృత్తాంతము నెఱింగిరి. సాయంతనము గోష్టిఁ జరిపిరి. అందు నూతనాగంతుకులు గాంధిజీ వెనువెంట జైలున కరుగ సంకల్పించితిమని మనోనిశ్చయమును జాటిరి.

గాంధిజీ కోరిక మేరకు గాంధిజీ కారాగారమున కేగినవెంటనే హక్, ప్రజకిశోరులు నాయకత్వమును వహించుటకును; పిమ్మట వారుకూడ ననిన ధరణీధర, రామనవమీప్రసాదు లాస్థానము నాక్రమించుటకును, వారును బంధింపఁబడిన రాజేంద్రప్రసాదు, శంభుశరన్, అనుగ్రహనారాయణగార లా నాయకత్వమునకుఁ బూనుటకును నొక నిర్ణీత పథకము నమర్చుకొనిరి.

19 వ తేదీ నుండి యథాప్రకారము రైతుల వాఙ్మూలములు గైకొను పనిని ప్రారంభించిరి. గాంధిజీ యనుచరులు విశ్రాంతి నెఱుంగక యేకకార్యదీక్షాతత్పరులై, యుత్సాహాతిశయంబుతో, నుదయమునుండి సాయంసమయము వరకు వ్రాసికొనుచుండిరి. చెప్పినది లిఖించుటయేగాక వారిని బృచ్ఛించి, యాథార్థ్యమును దఱచి, నిజమని నమ్మిక గలిగినదిమాత్రమే వ్రాసికొనుటకై యారితేరిన న్యాయవాదులకార్యమున నియమింపఁబడిరి.

20 వ తేదీని గాంధిజీపైఁగల యభియోగ ముపసంహరించుకొనఁబడినట్లు వార్త చేరెను. అంతటితోఁ బ్రజానీకము, నాయకులు, తమ సంతసమును వెల్లడించిరి. వార్తాపత్రికలు కమీషనరు మౌర్ఖ్యమును విమర్శించుచు ప్రభుత్వమువారి వివేకమును గొనియాడుచు వార్తలఁ బ్రచురించినవి.

గాంధిజీ యటనుండి బెట్టియాపట్టణమునకుఁ దరలెను. అచటివా రాతనికి హృదయపూర్వక స్వాగత మొసంగిరి. అచ్చటను నమ్మహనీయుఁడు రైతులయొద్ద వాఙ్మూలములు

గైకొనెను. ఇవ్విధముగ నాలుగువేల కర్షకులనుండి వారి కష్టముల జాబితా గ్రహింపఁబడినది. వాని సారాంశమును గైకొని గాంధిజీ పాట్నాలోని బీహారు గవర్నరు మూఁడీని దర్శించి వానికి నివేదించెను. తోట యజమానులగు యూరోపియనులు, ఆంగ్లోయూరోపియను పత్రికలు వారికి చేతనైనంత యలజడిని ప్రారంభించిరి. చిరకాలార్జిత ధనసంచయములింక నిల్వనేరదను భీతి వారికిఁదోచెను. ఆందోళనపరుల వ్రాతలను నమ్మవలదనియు, నధికారేతరుల విచారణసంఘమున జేర్చవలదనియు, నవసరమని తోచిన ప్రభుత్వోద్యోగులనే విచారణ సంఘముగ నియమించి పంపుడనియు మొఱపెట్టికొనిరి.

ఒకవంక యూరోపియను లీరీతి విచారణసంఘ నియామకమునకు వ్యతిరేకముగ నాందోళనము గావించుచుండ, మఱియొకవంక గాంధిజీ సర్ ఎడ్వర్డుగియుట్‌తో మంతనములొనర్చుచుండెను. గాంధిజీ యనుచరు లెట్టివార్త వచ్చునో యను నాతురతతో నిరీక్షించుచుండిరి. నాఁడు జూను నాల్గవ తేది. నాఁటిరాత్రి వారందరేవేవియో స్వప్నముల గాంచుచుండిరి. మరుదినమునకు వర్తమానములేదు.

రాంచినగరములో లెఫ్టినెంటు గవర్నరు సర్ ఎడ్వర్డు గియుట్‌తోడను, వారి కార్యనిర్వాహక వర్గముతోడను మహాత్ముఁడు మూఁడు దినములు మంతనములు సాగించిన యనంతరము మహాత్మాగాంధితో గూడిన యొక విచారణసంఘమును నియమింప ప్రభుత్వము నిశ్చయించెను. ఇవ్విధమున విజయుఁడై

పాట్నా కరుదెంచుచున్న గాంధిజీని మార్గమధ్యమున భార్యా పుత్రిలు కలిసికొనిరి. కస్తూరిబాయి, దేవదాసులతోఁ గూడి యాతఁడు పాట్నా చేరెను. బ్రజకిశోరబాబు వారి వెంటనే యుండెను. మదనమోహనమాలవ్యా వారికొఱకె యెదురు చూచుచు నటనుండెను. మఱుసటిరోజున వారు బెట్టియానగర మునకరిగిరి. అచట వారలకు ఘనముగ స్వాగత మొసగఁబడెను. ఏవాఁడు ప్రభుత్వముచే నిర్బంధింపఁబడునని ప్రజలెల్లరు తలంచుచుండిరో, యా గాంధిజీ విజయ మొంది భార్యాపుత్రు లతోఁ దిరిగివచ్చెను. సత్యాగ్రహ ప్రభావ మెంత మహత్తర మైనది!

విచారణసంఘ నియామకము తప్పనిసరిగా తోఁచుట వలన యూరోపియనులు ప్రభుత్వమువారితో సంప్రతింపులు జరిపి తన్నియామక సూచనలలో గొంతమార్పుచేసిన వెనుక విధిలేక యంగీకరించిరి. సంఘసభ్యులలో గాంధిజీపేరును గూడ జేర్చిరి. ఇయ్యది వారలకు కంటకప్రాయమాయెను. అయిన నేమిచేయగలరు?

నియమింపబడిన సంఘమునకు భూస్వాముల రైతుల తగవులను విచారించుటకును, నింతకుపూర్వమే గైకొనిన సాక్ష్యములు గాక యితరవిధములైన సాక్ష్యముల సేకరించుకొనుటకును, విచారింపబడిన రైతుల కష్టనివారణమునకు సలహా లొసఁగుచు ప్రభుత్వమునకు సలహానొసంగుటకును పరిపూర్ణాధి కారమీయఁబడెను. అందులకు మూఁడుమాసముల కాలపరి మితి యొసంగఁబడెను.

విచారణ సంఘసమావేశములు జూలై 15 వ తేదీ నుండి యు బెట్టియా, మోతీహారి, మున్నగు ప్రదేశములయందు జరుపఁబడుననియు, రైతులు వారి కష్టములను వారియెదుట నివేదించుకొనవలసినదనియుఁ బ్రకటింపఁబడెను.

మహాత్మాగాంధిజీని విచారణ సంఘసభ్యుఁడుగా ప్రభుత్వమేనియమించి తమ కష్టముల విచారింపఁబడునని విని చాంపరాను రైతుల కమితానంద మొదవెను. వారి బాధలన్నియు నాఁడే నివారణమయినట్లు సంతసించిరి. బెట్టియాలో మహాత్ముఁడు నివసించు ధర్మశాల యాత్రాస్థలమయ్యెను.

విచారణ సంఘము పెక్కండ్రు సాక్షులను విచారించెను. అటు రైతులను నిటు తోటయజమానులను విచారించెను. పెక్కుదినములు సభ్యులందఱు చర్చలు సలిపి తుట్టతుదకు అక్టోబరు 4 వ తేదీన తమసంఘనివేదికను ప్రభుత్వమునకుఁ బంపఁగలిగిరి. అందలి విశేషమేమన సభ్యులెల్ల రేకగ్రీవముగా నానివేదిక నంగీకరించి ప్రచురించిరి. అందు పేదరైతుల కష్టములు చాలవఱకుఁ దొలగింపఁబడుటకు సూచనలు గావింపబడినవి. ప్రభుత్వామోదము నొందిన సూచనలను రైతులకు దెలియగలందులకు జిల్లాయందంతటను బంచఁబడెను. అందుచే మరల యూరోపియను యజమానులకు మఱింత కష్టముతోచెను. దానిపై వ్యర్థముగ నాందోళన మొనరించిరి. మహాత్ముని కృపావిశేషమున తమ కడగండ్లంతమయ్యెననియు, నిఁకఁ జేతులెదపై నిడికొని స్వాస్థ్యమొంది నిదురింప వచ్చుననియు రైతులెల్లరు నాహ్లాదమొందిరి.

రైతుల సౌకర్యార్థము 'చాంపరాను ఎగ్రేరియన్ ఆక్టు' అనుచట్టమును నవంబరు నెలలో శాసనసభయందు ప్రవేశపెట్టి శాసన మొనరించిరి. దానితో చాంపరాను రైతులకష్టములు తీరినవని చెప్పవచ్చును.

రైతులకు శాశ్వతసౌఖ్యము చేకూర్చవలెననిన వారి యందు విజ్ఞానబీజముల నాటవలెనని యతఁడు నెమ్మనంబునం దలంచెను. అందులకు నిర్మాణకార్యక్రమ మవసరము. ఇట్టి పనులయందు గాంధిజీకి జిన్నతనమునుండియు నభిరుచి మెండు. అందులకై చాంపరానులోఁ బెక్కు పాఠశాలల నెలకొల్పి ఆరోగ్యము, నైర్మల్యమునుగూర్చి యుపన్యాసము లిప్పించుచుండెను. పాఠశాలలయందు విద్యాప్రబోధము గావించుటకు స్వచ్ఛంద సేవకుల నేర్పఱచెను.

ఇవ్విధమున చాంపరాను నందు గాంధిజీ కృషిఫలించి వారెల్లరు స్వతంత్రులు, సౌఖ్యవంతులు నయిరి. భారతదేశ స్వరాజ్యసౌధమునకు గాంధిజీ చాంపరానులోఁ బునాది వేసెను. అందులకు స్వార్థత్యాగపరాయణులగు స్వచ్ఛందభటు లెందఱో వానికిఁ జేదోడుగా నుండిరి.

---

# బార్డోలీ సత్యాగ్రహము.

## సర్దార్ వల్లభాయి పటేల్.

అచంచల ధైర్యము, అనుపమ శౌర్యము, అఖండ త్యాగము, అనిందిత శీలము, అతులిత సాహసము, అకలంక చరిత్రముతో విరాజిల్లు మహామనీషి యతఁడు. నిఖిల సద్గుణములు రాశీభూతమై పురుషాకారము ధరించెనో యననొప్పు వ్యక్తియతఁడు. సకలవిధముల నాతనికి సాటి యాతఁడేగాని మఱియొండు గానరాఁడు. అఖిల ప్రపంచమున కాదర్శజీవి.

ఎవని గంభీరోపన్యాస శ్రవణ జనిత మహోత్సాహ మమేయమై సభాసదుల నావేశమున నుఱ్ఱూతలూగించునో, ఎవని ధీప్రజ్ఞావిశేష మశేష జన సౌఖ్యానందప్రదమై వెల యునో, ఎవనిపైగల యఖండ విశ్వాస మఖిలజన సమూహము నకు స్వార్థ రాహిత్యపూరిత బుద్ధివిశేషమును గలిగించునో, ఎవ్వాని నామము బార్డోలీ కర్షకావళికి రామనామమువలె సంస్మరణీయమో, ఎవ్వాని సేవాభాగ్యము లభించుటవలన రైతులు నిరవధిక సౌఖ్య మనుభవించుచుండిరో, ఎవనికి సర్దారను బిరుదము లభించి సార్థకాభిఖ్యమై తనరారెనో, యామేటి సత్యాగ్రహవీరుఁడు. మహాత్మా గాంధిజీకిఁ గుడిభుజము నైన వీరాగ్రణి, సత్యవచనుఁడు, శాంతమూర్తి శ్రీ వల్లభాయి పటేలు.

1928 సంవత్సరమున గుజరాతు వరదలపాలయ్యెను పంటలు నాశనమయ్యెను. వేలకొలఁది జనులు గృహములఁ గోల్పోయిరి. పశువు లెన్నియో నష్టమైనవి. రైతులకు గొప్ప నష్టము సంభవించెను. ప్రభుత్వము నష్టనివారణమునకు గొంత ధనమును మంజూరు చేసెను. అది నిజముగ సరిపోదు. అంతే గాక యాధనమును సక్రమముగ వినియోగించి నిజమునకు నష్ట పడినవారికే దానిని చేర్చవలెను. ఇతర ప్రదేశములందలి వదాన్యులనుండి ధనమును సేకరించవలెను. ఇందులకు దగిన ప్రజాసేవకులు గావలెను. ఆసమయమున అహమదాబాదు నందున్న ప్రఖ్యాతన్యాయవాదియగు వల్లభాయిపటేలు కార్య రంగమున దుమికెను. అఖండసేవను నమానుష దీక్షారతి నొన రించి శ్లాఘాపాత్రుఁడయ్యెను, దొరతనము వారును నతనిసేవను నుగ్గడించిరి. బొంబాయి ప్రభుత్వ ఆర్థిక సభ్యుఁ డొకచో నివ్విధముగ వచించెను.

"గుజరాతీలు వ్యాపారమునకుఁ బ్రసిద్ధి నొంది యున్నారు. వారికింతకుముందు ప్రజాసేవ యన నేమో తెలి యదు. కాని మహాత్మా గాంధిజీ కృపివలన స్వార్థ త్యాగ ముతో ప్రజలను సేవించగలవారు కొందరీ దేశమునను వెలసిరి. మహాత్ముఁడు తమమధ్య లేకుండినను సంశయింపక యీవరదల సందర్భమున నింత సేవ యొనర్చినారనిన నీగౌరవమెల్లను వల్ల భాయి పటేలుగారికే చెందవలసియున్నది."

ఇట్టి పొగడ్త నొసంగిన ప్రభుత్వమే వేఱొక కార్యరంగ మున వలభాయి నాయకుఁడై యుద్యమమును నడపుచున్న

తఱి 'పైనుండి వచ్చినవాఁడని' యపహాస్యమును జేసి ఘృణతా దృష్టిఁ బరపిరి. అయ్యది బార్డోలీ సత్యాగ్రహ సమర సమయ మున.

1928 సంవత్సరము ఫిబ్రవరి 12వ తేదీన బార్డోలీలో వివిధ గ్రామములనుండి యేతెంచిన రైతుబిడ్డల గూర్చెను. కొంతకాలము చర్చించినపిమ్మట శ్రీయుత వల్లభాయిగారిట్లు గంభీరోపన్యాస మొసఁగిరి.

"రైతుసోదరులారా!

మనమీనాడతి క్లిష్టపరిస్థితులలో నిటసమావేశమైతిమి. అత్యంత బాధ్యతాయుత తీర్మాన మొకదాని నిపుడు గావించ వలసియున్నది. మనపై బడిన పన్నులభారమును గూర్చి విచా రించుటకు నిష్పాక్షికమైన సంఘము నొకదాని నియమించుఁ డని గవర్నరుగారికి లేఖ వ్రాసితిని. అందులకుఁ బ్రత్యుత్తర ముగా 'అధికారులు యోచించుటకై నీయుత్తరము నార్థిక శాఖవారికిఁ బంపితి' మని మాత్రము వ్రాసిరి. కావున మన మింక వారి దయా దాక్షిణ్యములకు నిరీక్షింపఁ బనిలేదు. విచారణను జరుపువఱకు పన్నుల వసూలు నాపితిమని వారు వ్రాసిన మనము సంతోషింపనగును. మనమీసభ నింతటితో ముగించి మన గృహముల కేగుదుము. కాని దైవమన్యథా తలంచెను.

నేఁడిట్లు కరంబుకరము గొనుట కొసఁగిన యుత్తరవు లన్యాయములు. అంతేగాదు. అయ్యవి శాసనబద్ధములు గూడఁ

గావని న్యాయశాస్త్రమును బరిశీలించి కనుఁగొంటిని. సెటిల్ మెంటు ఆఫీసరుగారు గ్రామగ్రామమునకుఁ దిరిగి భూసారమును బరీక్షించి హెచ్చుపన్నుల విధింపవలసియున్నది. కాని వారట్లు గావించలేదు. క్రొత్తపన్నులు వేయుటకు ముందుఁ బ్రజలకు నావిషయమును సాటింపవలసియున్నది. కాని వారదియును గావింపలేదు. కావున ప్రభుత్వమువారు మనతోడి సమాధానమునకు వచ్చువఱకు నూతన భాగధేయము నీయకుండుట లెస్స. బహుళముగ నాలోచించి నేను మీకీ యుపపత్తిని దెలుపుచున్నాను. చక్కగా యోచించుకొనుఁడు.

ఇందువలన మనము ప్రభుత్వముతోఁ బోరాడవలసి యుండును. ప్రభుత్వము బలవత్తరమైనది. మనలను బలుకష్టముల పాల్సేతురు. ఆసమయమున ప్రశాంతముగ బాధల ననుభవించుట తప్ప మఱి చేయఁదగిన దేదియు నుండదు. కష్టసహిష్ణుత కంగీకరించినచో రాక్షస ప్రభుత్వముతోనైనను ఢీకొను శక్తి మనకు గలదు.

ఈ పన్నుల నిరాకరణోద్యమమునందు కేవల మార్థికతత్త్వమే యిమిడియుండలేదు. ఇది మన యాత్మగౌరవమునకు గూడ సంబంధించియున్నది. మన యనుమతిలేక మనపైఁ బన్నువేయు నధికారము భూమండలమున నెవరికిని నుండదు. ఇందు మీయభిమతమును వారెఱింగియుండలేదు. ప్రభుత్వము నిజేచ్ఛ పన్నుల విధించుట నిరంకుశ విధానము. కావున యట్టి విధానముతోనే మన పోరాటము.

ఇంకొక హెచ్చరిక గావించి విరమింతును. ప్రభుత్వము మిమ్మనేకవిధులఁ బరీక్షించును. మీలో మీకుఁ గలహములు కలిగించును. మీ భూములను స్వాధీనము చేసికొని వేలము వేయుసు. ఇంకను జెప్పనలవిగాని బాధలకు మిమ్ము గురి చేయును. ఇన్నిఁటికిని జలింపని స్థిరచిత్తము మీకున్న నీ తీర్మానమును నంగీకరింపుఁడు. లేదేని మానుకొనుఁడు"

పటేలుగారిట్లుపన్యసించినపిమ్మట నాసభలోనివారెల్ల నేకగ్రీవముగ పన్నులనిరాకరణోద్యమ తీర్మానమును గావించిరి. వివిధమతగ్రంథములనుండి కొన్ని వాక్యములుచదివి రామ స్మరణగావించుచు తీర్మానము నామోదించిరి.

బార్డోలి సూరతుజిల్లాలోని యొకతాలూకా. దాని వైశాల్యము 222 చదరపుమైళ్ళు. అందు నూటముప్పదియేడు గ్రామములు కలవు. జనసంఖ్య యెనుబదియేడువేలు. ప్రజ లందఱు వ్యవసాయదారులు. బార్డోలీ తాలూకాకు కేంద్ర స్థానము. సార్భాన్, వారడ్, వాంకనర్ చెప్పఁదగిన పెద్ద గ్రామములు. ఈతాలూకాలో నానాఁటికి భూమిశిస్తు పెచ్చు పెరుగుచుండెను. సెటిల్‌మెంటుజరిగిన ప్రతిపర్యాయము పన్ను హెచ్చింపుజేయుటేకాని యెన్నఁడును తగ్గింపఁబడలేదు. హెచ్చుపంటలు పండుచున్నవా యనిన నదిదుర్భము. పన్నుల భారమున కృంగికృశించుచున్న కర్షకులకు సాయమొనర్చు వారెవరు? అంతటంతట వారు గావించు మొరలరణ్యరోదనము లగుచుండెను, చేయునదిలేక వారట్టులే జీవయాత్ర సల్పుచుండిరి.

1926 లో సెటిల్మెంటు జరుపుటకు ఎం. ఎస్. జయకరు గారు నియోగింపఁబడిరి. వారి కీకృత్యము సరిక్రొత్త. అనుభవము శూన్యము. ఆయన గాగీతాలూకా భూములకు నూటికిరువదియైదు రూప్యములవంతున పెంపుఁజేయవలెనని సలహానొసంగెను. ఇవ్విధముగ పన్నులను హెచ్చించుట కామహనీయుఁడు సూపిన కారణము లెంతహాస్యాస్పదము లుగ నున్నవో వీక్షించుఁడు.

1. రాకపోకల వసతులు హెచ్చుగావింపఁబడినవి.
2. జనాభా యభివృద్ధిసెందినది.
3. పాడిపశువులును, బండ్లును హెచ్చుపెరిగినవి.
4. నూతనకట్టడములు వెలయుచున్నవి. అయ్యదైశ్వర్యమభివృద్ధిసెందిన లక్షణము.
5. హీనజాతులస్థితి బాగుపడినది.
6. ధాన్యాదులకు ధరలు పెరిగెను.
7. వ్యవసాయకూలీలకు పనులు హెచ్చయ్యెను.
8. భూములధరలు హెచ్చెను.

ఏమైనను నీనివేదిక యప్పుడు ప్రకటింపఁబడలేదు. దానిపై బార్డోలీప్రజలు నాఁటినుండియు శాసనసభలలోనుండియు, బహిరంగసభలమూలమునను, రాయబారముల ద్వారాను, మహాజనులవలనను నాందోళనము గావించుచుండిరి. కాని బూడిదనుబోసిన పన్నీటిచందమున వారి యలజడి నిష్ఫలమయ్యెను. స్థానికనాయకులు వారికిఁ జేతనైన యుపాయముల

నన్నింటిని బ్రయోగించి విసివిరి. ప్రజలు తమనీకష్టవారిధినుండి యుద్ధరింపఁజాలిన సమర్థుఁడగు నాయకోత్తమునికై వెతుక సాగిరి. తుదకు వారికట్టినాయకుఁడు లభించెను. అతఁడే శ్రీవల్ల భాయిపటేలు.

జిజ్ఞాసువులగు నటకులుండిరి. అతిసమర్థుఁడగు సూత్ర ధారుఁడుండెను. విశాలమగు కార్యరంగముండెను. ఇంక నాట కారంభమునకు జాగేల? పాత్రలు సంసిద్ధముగ నున్నయవి. కాలము సమీపించినది. యవని కెత్తఁబడినది. నాటకము సత్యాగ్రహసమరము.

నాంది గీత మాలాపింపఁబడినది. వల్లభాయిగారు ప్రభు త్వమున కొక లేఖనంపిరి. ప్రజల యిక్కట్టుల నెఱుంగుటకు విచారణసంఘము నియమించుమనిరి. వారెట్టి తీర్పునిచ్చినను బ్రజలంగీకరింతురని వాగ్దాన మొసంగిరి. కాని ప్రభుత్వ మింత మాత్రమునకే లొంగునా?

ప్రథమాంకము. పది, పదునేను గ్రామముల కొకశిబిర మేర్పరుపఁబడెను. శిబిరనాయకులు నియమింపఁబడిరి. ఐచ్ఛిక భటులు చేరిరి. వల్లభాయిపటేలుగారు శిబిరముల నన్నింటిని సందర్శించుచు, నచటివారలకు ధైర్యమును బురికొల్పుచు, సలహాలనొసంగుచు దౌర్జన్యరాహిత్యయుద్ధమును నతిజాగరూ కతతో నడపుచుండెను.

వాలడ్గ్రామములోని పదునైదుగురు వర్తకులపై హెచ్చుపన్నును విధించిరి. పన్నియనిచో వారిభూములు జప్తు

చేయఁబడుననియు, పిమ్మట వేలము వేయఁబడుననియు వారికిఁ దెలియఁజేసిరి. పెద్దవయను గ్రామమునసబు గ్రామములోని రైతునొకనిని తిట్టి, కొట్టి బాధించెను. మరి రెండుగ్రామముల నుండియు నిట్టివార్తలే చేరెను.

ఒక అనుభవశూన్యుఁడగు డిప్యూటీకలెక్టరు ఒకగ్రామమున కేగి యచటిరైతులలో ముఖ్యునొకని రావించి "అయ్యా! పన్నువసూలుచేయుటకు వచ్చితిని. పన్నును వెంటనేయిండు."

"పన్నులభారముచే క్రుంగిపోవుచున్నాము. అదనపు పన్నును రద్దుచేసినచో పన్నునొసంగెదము."

"ముందు పన్నిండు. తరువాత ప్రభుత్వమువారాలోచింతురు."

"ఎంతకాలమునుండియో విన్నవించుకొనుచుంటిమి. తక్కుంగల సాధనములన్నియు నిష్ఫలములైనవెనుకనే మేమీ విధానమవలంబించితిమి."

"పోనీ! నేను వచ్చినందులకు, నాసంతృప్తికైన నొక్క రూపాయిని చెల్లింపుఁడు."

"అయ్యా! మీయందు మాకు నాదరముకలదు. కాని గ్రామస్థుల యంగీకారములేనిది నేనొక్కడ నెటులీయఁగలను?"

"నేను మిమ్ములను జైలునకంపెదను - అపుడు?

"మీరవ్విధినేల గావింతురు? మేమేమి రాజద్రోహమాచరించితిమి'

డిప్యూటికలెక్టరా రైతును క్షమాపణవేడి పంపివేసి తన దారిని దానేగెను.

వల్లభాయిపటేలుగారు గ్రామములవెంటఁ దిరుగుచు గ్రామపెత్తందారు తన సోదరుల యాస్తిని జప్తుచేయించి బాధించుట న్యాయముకాదనియు, జప్తుచేసినయాస్తి నెవ్వరును కొనరాదనియు ప్రబోధించుచుండెను. వారి యమృతవాక్కులను వినిన వారందఱట్టి నీచకృత్యములకుఁ బాల్పడమని తీర్మానించుకొనుచుండిరి.

ప్రభుత్వమువారు ప్రజలను భయపెట్టుటకు సంకల్పించిరి. అందులకువారు ప్రత్యేకముగాఁ గొందఱనెన్నుకొనిరి. వైశ్యులు భీరువులు. వారు శీఘ్రముగ భయభ్రాంతులయి లొంగుదురని వారి యూహ.

బాజీపురమున వీర్చందుచినాజీ యను నొకవర్తకప్రముఖుఁడు గలఁడు. ఆతనిద్వారమునకు రివెన్యూయిన్స్పెక్టరు సంతకముతో నొక ప్రకటన యంటింపఁబడియుండెను. ఆతనికి వాలడ్‌లోఁ గొంతభూమికలదు. దానికిగాను రు 160—15—4 లు శిస్తును ఏప్రియలు 12 వ తేదీ నాఁటికిఁ జెల్లింపవలయుననియు నటులఁజేయనిచో నాతని భూమిని సర్కారువశముచేసుకొందురనియు నాప్రకటనలోఁ దెలుపఁబడెను.

ఆవర్తకుఁడీ ప్రకటనము చూచుకొనెను కాని అధైర్యపడలేదు. రివెన్యూఇన్స్పెక్టరుకొక లేఖ వ్రాసెను.

"ఈడివిజనులోని కెల్ల నన్నే యెన్నుకొని నాపై నిట్టి యుత్తరవు నొసంగుటవలన నన్ను పిఱికివాఁడని తమరు భ్రమ సెందినటులఁ దలంచెద. ఈ తాలూకాలోని భూములనన్నింటిని మీరు స్వాధీనము చేసికొనినను నొక్కగవ్వయైనను శిస్తుమీకు వసూలు కానేరదు. ప్రభుత్వము హెచ్చుపన్నును రద్దుచేసినచో పన్నులు చెల్లింపఁబడగలవు. కావున మీకు రాజభక్తి కలదేని యీసమాచారమును వెంటనే మీ యధికారులకుఁ దెల్పుడు. మీరుద్యోగమునుండి విరమించుకొను తరుణ మాసన్నమయిన సమయమున నిట్టి దురంతములకుఁ బాల్పడవలసిన యవసరము మీకేమి? రైతుల భూముల నపహరింపఁజూచుటకంటె మద్యో గమును నేఁడే విడచి సుఖముగ, ప్రశాంతముగ, ప్రజానురాగ మునుబొంది జీవించుట లగ్గని సలహా నొసంగు చున్నాను."

ఇందుమూలమున వల్లభాయిగారి ప్రబోధామృతమును గ్రోలి ప్రజలెంత నిర్భీతిమెయి సంచరించుచుండిరో విశదమగు చున్నది. స్త్రీలు, పురుషులు దౌర్జన్యరాహిత్య సత్యాగ్రహ సమర రంగమున దుమికి తమ శక్తిని బ్రదర్శించుచుండిరి. పురు షుల కంటెను స్త్రీలు జూపునుత్సాహమునకు మేర లేకుండెను. వల్లభాయిపటేలుగారు వ్యవసాయదారుల 'సర్దార' య్యెను. ఆయనకు రైతే దేవుఁడు. అతఁడు స్వయముగ రైతుబిడ్డ. రైతుల కష్టసుఖముల నెఱింగినవాఁడు. ప్రపంచమంతయు కృషీవలునిపై నాధారపడియున్నదని యాతని విశ్వాసము. కృషికుల దుర్భర దురంత వేదనాకర దుస్థితిని జూడ నాతని నయనములు బాష్పపూరితములగుచుండెను.

వ్యవసాయదారగా మహనీయుని దృష్టిలో నాదర్శ ప్రాయుడు. నిష్కల్మషుడు, దైవభీతిగలవాడు, కష్టజీవి, నిష్కపటి, సత్యసంధుడు, కాని మిక్కిలిభీరచిత్తుడు. సర్కారుద్యోగిని గాంచిన గజగజవడంకును. తొట్రుపాటుపడును. అట్టి వానిలో ధైర్యమంకురించెనా భారతదేశము స్వాతంత్ర్యమును బడసినట్లే. రైతులకు ధైర్యోత్సాహములు చేకూర్చుటలో వల్లభాయి కృతకృత్యుడయ్యెను.

బార్డోలీలో పన్నుల నిరాకరణోద్యమ మప్రతిహతముగ కొనసాగించుచుండిరి. ప్రజలు సుస్థిరులైనకొలదియు ప్రభుత్వము నూతనోపాయముల నెనుకజొచ్చిరి. న్యాయ పరిపాలనమునకు స్వస్తిచెప్పిరి. సాధారణముగ పన్నులు వసూలుగావించుటకు స్థిరచరాస్తులను స్వాధీనముచేసికొని వాని నమ్మి ధనము రాబట్టుకొనుచుందురు. కాని యీ విధానమునందును గొన్ని నియమములు గలవు. ఆస్తిని స్వాధీనము చేసికొనునపుడు సాక్షులుండవలెను. వంటపాత్రలను, వ్యవసాయపు పరికరములను స్వాధీనపరచుకొనరాదు. ఆతని జీవనోపాధికి నవసరమగు పశువులను బట్టుకొనరాదు. కాపురముండెడి గృహములను బ్రవేశింపరాదు. మఱియు సాయం ప్రాతఃకాలములందు స్వాధీనమును గావించుకొనరాదు. ఇట్టి నియమములన్నియు నేనాడో మంటగలుపబడెను.

అన్యాయము లమితములయ్యెను. పారశీవారికా ప్రదేశముల సారాదుకాణములు కలవు. ఇక నా దుకాణముల

నిచ్చుమెయుని గచ్చుం విచ్చుంగావింప తలపడిరి. ఒకనాఁడొక పారశీ సారాదుకాణమును రివెన్యూఇన్‌స్పెక్టరు వశపరచు కొనెను. అందు సారాపీపాలు గలవు. కాని వానిని గైకొని పోవువారెవరును లభింపమి నాకొట్టునకు తాళమువేసి ప్రభుత్వపు సీలువేసెను.

ఆ పారశీకుఁడతి సాహసి. వెంటనే డిప్యూటీకలెక్టరు నకుఁ దనకు గావించిన యన్యాయమును గూర్చి లేఖ వ్రాసి కొనెను. దుకాణమును మూసినందువలన వచ్చు నష్టమునకు ప్రభుత్వపక్షమున నాయుద్యోగియే బాధ్యతవహింపవలసి యుండెనని తెలిపెను. పైపెచ్చు సర్కారు స్వాధీనపఱచు కొనిన పీపాలను దన దుకాణమున నుంచినందులకు రోజున కైదురూప్యములు 'అద్దె' యీవలసియుండునని తెలిపెను. పై యుద్యోగస్థులు వెంటనేసను దెంచి దుకాణమును దెరపించిరి. కాని యాతఁడిట్టి పని కావించినందులకు వాతనిని తమయొద్ద నున్న దోషుల జాబితాలోఁ జేర్చిరి.

మఱియొకచోట క్రొత్త రివిన్యూఇన్‌స్పెక్టరొకఁడు పఱువాతనేలేచి యొకపల్లియకరిగి యొక్కచోఁ గానరబ్బంద మును గాంచి యవి యేరివా యను జింతలేకయ వానినెల్లఁ దోలికొనిపోయెను. ఇంకొకదెస తస్కరసమూహము పశు సమూహమును దోలుకొనిపోయి, వాలక్‌లోని పోలీసుస్టేషను నందొక పత్రికటనమును గట్టిరి. "శికారు గ్రామపైతు రామ గోవిందు, మఱికొందఱి పశువులు జప్తుచేయఁబడినవి." తోలు

కొనిపోవునపుడు వానిలోఁ గొన్నింటిని జంపివేసిరి. ఇప్పగిది రాక్షసకృత్యములు లెక్కకు మిక్కిలిగ గావించుచు ప్రజల భీతావహుల గావించుచున్నను మేరుసమ ధీరులై వారు నిలువఁ బడిరి.

ప్రజలు ధైర్యము జూపినకొలఁదియు ప్రభుత్వము దురంతములకుఁ బాల్పడుచుండిరి. ఇఁకఁ జేయునదిలేక రవిశంకరుఁడును సత్యాగ్రహయోధునిపై నభియోగము దెచ్చిరి. ఆతనిపైఁ దెచ్చిన యభియోగమేమన నాతఁడు ప్రభుత్వోద్యోగుల కార్యనిర్వహణమున కాటంకము కలిగించెననియుఁ, దనకుఁ బ్రవేశార్హతలేని ప్రదేశమున నాతఁడు ప్రవేశించెననియు, ఇది యాతఁడొనరించిన నేరము. డిప్యూటీకలెక్టరొకపరి వాలడ్‌కు విచ్చేసెను. ఆతని సామానులు దెచ్చుటకు బండ్లు కావలసియుండెను. మూఁడు బండ్లకు కబురంపిరి. బండ్ల యజమాని రవిశంకరునితో నటకేగి బండ్లమనుష్యులను బిలుచుకొనిపోయెను. బండివాఁడు తాను రానని చెప్పుచుండగ రవిశంకరుఁడు బండివానిని బలవంతపెట్టుట పాడిగాదని రివిన్యూ ఇన్‌స్పెక్టరునకు దెల్పెను. అంత నాయుద్యోగి రవిశంకరుని నటనుండి వెడలిపొమ్మనియెను. వానితోఁ బాటు బండివాఁడును శకటము నచటనే విడచి యేగెను. మిగిలిన నిరువురు బండివారును నేగిరి. ఇది రవిశంకరుని యక్రమప్రవర్తనము.

రవిశంకరునకు న్యాయమూర్తి అయిదునెలల పది దినముల కఠినశిక్ష విధించెను. ఆతఁడు కారాగృహమునకేగెను.

బార్డోలీలోని ప్రిధము సత్యాగ్రహ ఖైదీ యను గౌరవ మాతనికే దక్కినది. తాలూకాయంతయు హారతాళము గావించి వానియందు గౌరవాదరములఁ బ్రకటించిరి. మహాత్ముఁడు ప్రశంసించెను. తక్కుంగల సత్యాగ్రిహులు తమ కెన్నఁడిట్టి గౌరవము చేకూఱునా యని నిరీక్షించుచుండిరి.

భూములున్నవారు పన్నును గట్టుట సహజము. కాని భూమి లేనివారేల శిస్తుచెల్లించవలెను. అఖండ ప్రజ్ఞావిశేషము గలిగిన ప్రిభుత్వముగూడ నొక్కొక్కతఱి వివేకమును గోల్పోవుచుండును. భూమిలేనివారి పాడిపశువులను గూడ బంధించి వారిని బాధించుచుండుట సామాన్యదృశ్యముగ నుండెను.

ఒక గ్రామమున నొక దర్జీవాఁడు కలఁడు. వానికి మూఁడు పాడిపశువులు. అవి తప్పిపోయినవి. వానికొఱకతఁడు మూఁడు దినములు గవేషించి పసివివేసారెను. చివరకు వానిని వాలడ్తాణాలోఁ గనుఁగొనెను. అంత నాతఁ డధికారియొద్ద కేగి విన్నవించుకొనెను. అందులకాయుద్యోగి రెండుదినముల నుండియు వీనిని భద్రముగా నుంచినందులకగు మేతఖర్చును, కాపుఖర్చును నిచ్చిన విడిపింతుననియెను. అంత నా కుట్టుపని వాఁడు "స్వామీ! నాకు భూమిలేదు. నేను శిస్తు చెల్లింప నవసరములేదు. అన్యాయముగా నా పశువులను దెచ్చినందుల కింక తమరే యేదియైన నాకు పరిహారమీయవలసియుండ నన్నేల యడిగెదరు?" అనియెను. అట్లైన దయచేయుమని

యుద్యోగి సంజ్ఞచేసెను. తుదకు వలంటీరులకుఁ దెలుపుదునని యాదర్జీ వచియింప యాయుద్యోగి పశువుల నాతని కొప్పగించెను.

రైతునకు ప్రాణము పశువు. రైతు తన సర్వస్వమును త్యజించియైనను పశువులను గాపాడుకొనును. అట్టిచో తమ పశువులను గొనిపోయి యాహారపానీయము లొసంగక మందు టగ్గిని వానిని బాధించుచుండ కాఁపుల హృదయములు తల్లడిల్లెను. కాని తమ నేతయందలి ప్రీతిమెయిని యెట్టి క్లిష్టపరిస్థితులయందును శాంతమును విడువక, దౌర్జన్యమునకు బాల్పడక యనన్యసాహసోపేతులై నిలిచిరి. ఉద్యమము సాగిపోవుచుండెను.

ప్రభుత్వోద్యోగులు గావించు దుండగము లంతకంతకు మితిమించుచుండెను. స్త్రీలనుగూడఁ బలువిధములగు బాధలకు గుఱికావించిరి. ఒక గ్రామములో నొక గృహమున నొక వృద్ధవితంతువు గలదు. ఆమెకు భూమి కొలఁదిగనుండ దాని నదివఱకే యితరులకు దానమొసఁగియుండెను. దానపత్రము ధృవపడనందున నామెయొద్దనే నాలుగురూపాయల శిస్తు వసూలుచేయవలెనని గ్రామాధికారి తెలిపెను. అందులకై ప్రభుత్వోద్యోగి యొకఁడు పెరటి దొడ్డిలోనికి చుమికి నూరు రూప్యములు వెలజేయు నామె గేదెను దోలుకొనిపోయెను. అయినను యాయవ్వ పన్ను నొసంగలేదు.

ఒకనాఁడు ప్రభుత్వోద్యోగి యొకఁడు మాధీయను జనపదమున కరిగెను. ఆతనివెంట పఠానుబలఁగము గలదు. వారు తెలతెలవారక ముందుగనే నచ్చటకేగిరి. ఒక పఠానుఁడొక యింటి పెరటిదొడ్డిం జొచ్చి తద్వారమున నింటం బ్రవేశింప నుంకించెను. మగవారింటలేరు. గేస్తురాలు తొలుదొల్త కొంత జంకెను గాని మరల నిబ్బరమునూని తటాలున లోని కరిగి తలుపు వేయఁ దలఁకొనెను. కాని యాపఠానుఁడాపెను వెంటాడి తలుపును ద్రోసికొనుచు నడ్డుపెట్టిన యాపె కరమును బట్టి బలవంతముగ నెట్టి యింటఁబ్రవేశించి యాయింటివారి పశువుల నేనిఁటిని స్వాధీనపఱచుకొని పోయెను.

ఈవిషయము నంతను గనిపెట్టియున్న మణిలాల్‌కొఠారి యాగృహిణినుండి వాఙ్మూలమును గొని తాలూకాయం దంతటను బ్రచురించెను.

ఎట్టి విషమ పరిస్థితులయందైనను బ్రజలు దౌర్జన్య కృత్యములకు గడంగకుండునటుల నెడనెడఁ బ్రోత్సహించుచుండెను. ఆతఁడొకచో నిట్లుద్ఘాటించెను. "ఎచటనైన నెన్నడైన నీ యుద్యమమునందుఁ బ్రభుత్వోద్యోగులయెడ దౌర్జన్యము సల్పఁబడినయెడలఁ దొలుదొల్త నాశిరము నిత్తునని కలెక్టరుగారికి నమ్మిక గల్గించితిని. చారుతర మందహాస వదనారవిందములతో మహామృత్యువు వక్త్రగహ్వారమున కరుగుటకైనను సంసిద్ధుఁడై యుండుఁడు గాని యెదిరి యొడలి నుండి యొక్క నెత్తురుబొట్టు కార్చుటకైనను జతన మొనర్పకుఁడు. మన భారతదేశమునకీ యహింసావ్రతమే తారకము"

మఱియొకచో నాతఁడివ్విధమున వినతి జేసెను. "పవిత్ర్రశాంత సబర్మతి యాశ్రమమున మహానిష్ఠాగరిష్ఠుఁడై, యఖండ సూత్రయజ్ఞ మొనరించుచు, దౌర్జన్య రాహిత్య సిద్ధాంతమును బ్రచారము సేయుచు, మన యుద్యమమును గమనించుచున్న శ్రీగాంధిమహానికి బాధ్యుఁడనయి, యీ తాలూకా యందలి ప్రజాశాంతిరక్షణ బాధ్యతను భుజస్కంధముల నూనితిని. అమ్మహాత్ముని నామధేయమే నాకు ధ్యేయము. ఆ ఋషీశ్వరుని యాజ్ఞాపాలనమే నాకు కర్జము. అట్టివాని పవిత్ర నామమునుగాని, యాతని దివ్య కార్యాచరణమునుగాని నాయొనర్చు నీషణ్మాత్రాపరాధముచే నైనను మలిన మొనర్పఁజాలను"

సత్యాగ్రహ సమర మిటుల నుద్ధృతమైయుండ నఖిల భారతదృష్టియు బార్డోలియందే లగ్న మొనర్పబడి యుండెను. అన్ని ప్రాంతముల వారును నీ బార్డోలి యందలి యుద్యమమును గమనించుచు, వారి ధైర్యమును గొనియాడుచు, వారి యిక్కట్టులకు గన్నీరు గార్చుచు కాలము బుచ్చుచుండిరి.

అహమ్మదాబాదునుండి బార్డోలిలోని వాలడ్‌కు రైలు బండి పోవుచుండెను అందులోనిద్రించుచున్న యొకపాంథుఁడు మేల్కని ప్రక్కవానితో

"అయ్యా! ఇదియేమి ఇంత బిగ్గఱగా నఱచుచు నాకు నిద్రాభంగము గావించితిరి!"

"సోదరా! బార్డోలిలో నంతలంతలు వింతలు జరుగుచుండ నీకెట్లు నిద్రపట్టుచున్నది?"

"మిత్రమా! ఏమి యావింత"

"ఓ భారతీయుడా! ఇంకనునీ వావృత్తాంతము నెఱుఁగవా? నీ దేప్రాంతము?"

"అయ్యా! మాది ఆంధ్రప్రాంతము. మేము వార్తా పత్రికలవలన బార్డోలిలోని రైతులు పన్నుల నెగవేయుచుండిరని మాత్రము తెలిసికొంటిమి"

"మిత్రమా! పత్రికలలోని వార్తలన్నియు ప్రభుత్వము వారు లోకమును గన్నుకప్పుటకు గావించు దుస్తంత్రములు. ఇదిగో యీ కరపత్రమును గాంచుఁడు బాబూ!"

"ఏదీ యొక్కపరి చదివి వినిపించుము"

"చదివెదను వినుము. మాఢీ యను గ్రామములో నొక యుద్యోగి వ్యవసాయదారుని యిల్లుసొచ్చి వానిభార్యను జేయి పట్టుకొని బయటికీడ్చి వాని యాస్తిని జప్తుగావించెను"

"ఔరా! ఉద్యోగు లెంతటి నైచ్యమునకు బాలుపడుచున్నారు? ఈదురంతములకు నంతమెన్నఁడోకదా!"

ఇవ్విధముగా రైలుప్రయాణీకులు బార్డోలీవృత్తాంతములఁ జర్చించుకొనుచుండిరి.

మొట్టమొదట నీయుద్యమమునకు ధనసహాయము నపేక్షింప సర్దారు నిరాకరించెను. ఉద్యమము విజయవంతమగు

చున్నకొలఁదియు ద్రవ్యమవసరమని పటేలుగారు కనుఁగొనిరి. అందుచే నాతఁడొకవిజ్ఞప్తిఁ గావించెను. మహాత్ముఁడు దానిని బలపరచెను. ఇంకేమి? ధనరాసులు గుప్పింపఁబడినవి. అంతకు ముందే వేయిరూప్యములు సమకూరినవి. ప్రతిగ్రామము నుండియు స్త్రీలు చందాలను బంపుచుండిరి. బొంబాయిమిత్రులు కొందఱు చందాలుపంపుట కాతురపడిరి. ఒకస్త్రీ యయిదు వందల రూప్యములంపి ప్రతిమాసమును నట్లే యయిదువందల రూప్యములఁబంప వాగ్దానము గావించెను. ఇవ్విధముగ ధనాభావములేక యుద్యమము నిరాటంకముగ సాగిపోవుచుండెను.

సర్దారుయొక్క సాహసౌదార్యోపేత కార్యదీక్షవలన సత్యాగ్రహసమరము దేశప్రజల దృష్టిపథమునకుఁ దేఁబడెను. అట్టిచో ప్రభుత్వపుకమీషనరు సత్యాగ్రహులనుగూర్చి మిక్కిలిహైన్యముగ మాటాడెను. వారంద ఱలజడినిగావించు మూఁకయనియు, తమజీవనమునకై బార్డోలీప్రజలపై నాధారపడియున్న నిరాధారులనియు నిందించెను.

ఈవిషయము తెలియగనే బొంబాయిలో కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గము సమావేశమై ప్రభుత్వముచేయు దురంతముల నిరసించి, ప్రజల న్యాయసమ్మతమగు గోరికలను బలపరచి, ప్రజాసేవఁ జేయుచున్న వల్లభాయి మున్నగు దేశభక్తుల త్యాగమును ప్రశంసించి, వారిని నిందించిన ప్రభుత్వాధికారి వారికి వ్రాతమూలకమైన క్షమాపణ నొసంగవలసినదిగాఁ దీర్మానించిరి.

ఇంతలో ప్రభుత్వపుం జైదములకు నిరసనముగా శాసన సభ్యులు గొందఱు రాజీనామాల నొసంగిరి. అట్టిమహనీయులు శ్రీదాదుభాయిదేశాయి, భీమభాయినాయిక్, శివదాసనీ, డాక్టరు దీక్షితులు.

కార్యనిర్వాహకవర్గ సమావేశమునకు వల్లభాయిగారు బొంబాయి వెళ్ళిరి. అచటి నాయకులందఱను గలిసికొని బార్డోలీ విషయమున సంప్రతించిరి. కాని వారినెవ్వరిని మర్యాదకొఱ కైనను నాహ్వానింపలేదు. దానివలన జిక్కులుగలుగునని యాతఁడు భయపడెను. అయినను డాక్టరు అన్సారీ, మౌలానా షౌకతాలీ, మహమ్మదు బెలాలుగారలు బార్డోలీకేగి ముస ల్మానులందఱను న్యాయముకొఱకు బార్డోలీప్రజలతో నేకీభవించియున్నందులకు సంతసమును వెలిబుచ్చిరి. అచటఁ జూపట్టిన యైకమత్యమునకుఁ బరమాశ్చర్యచకితులైరి.

బరూచా, నారిమన్‌గారలును బార్డోలికేగి యచటిపార్సీ వ్యవసాయదారులు చూపుచున్న ధైర్యస్థైర్యములను మెచ్చు కొనిరి. నారిమన్‌గారు ప్రభుత్వ నిర్బంధచర్యలనుగురించి బార్డోలీసభలోఁ దీవ్రముగ నిరసనమును దెలిపెను.

సిక్కులుగూడ నీశాంతిసమరమునెడ సానుభూతిని బ్రదర్శించుచుండిరి. వలసినచో సాయమునొనర్ప తమ సంసిద్ధ తను వెల్లడించిరి. సర్దారు మంగళసింగు బార్డోలీవచ్చి స్వయ ముగా విషయముల గ్రహించి యమందానంద భరితస్వాంతుఁ

డయ్యెను. పంజాబునుండి డాక్టరు సత్యపాలుగా రీయుద్యమ మును బరీక్షింప రాష్ట్రీకాంగ్రెసువారిచేఁ బంపఁబడిరి. ఆతఁ డీవీరసంగ్రామమును దిలకించి హర్షపులకితగాత్రుఁడై, యానంద బాష్పవారిపూరితనేత్రుఁడై యరిగెను.

అన్యరాష్ట్రీయు లిట్టివిధి ముగ్ధులగుటకుఁ గారణము లేక పోలేదు. అచటి ప్రజలు చూపిన స్థైర్య మప్రతిహతము. అచటి గ్రామములు దుర్గములయ్యెను. ఇస్రోలి యను నొకగ్రామము కలదు. ఈయాందోళనానంతర మాగ్రామములోని హెచ్చు పన్నును తగ్గించిరి. ఇది 'చీలదీసి పాలించు' అను బ్రిటిషు రాజ ౹తి ననుసరించి చేసినపనియే. ఇవిధముగా తాలూకాయంత టిలోను నాలుగుగ్రామములకు శిస్తును తగ్గించిరి. అయినను నీనాలుగుగ్రామములవారును తక్కినవారిని తెగనాడలేదు. తమ దున్నలు, గేదెలు జప్తుచేయబడినను, తమభూములన్నియు ప్రభుత్వమువారు స్వాధీన మొనర్చుకొనినను పూజ్య శ్రీగాంధీ మహాత్మునియందలి భక్తిప్రపత్తులవలనను, తమనాయకుఁడగు పటేలుజీయందలి గౌరవభావమువలనను వారుద్యమమునుండి జారిపోకుండిరి.

తాలూకామొత్తముపై పదునారు సత్యాగ్రహశిబిర ములు కలవు. అందు రెండువందలయేఁబదిమంది స్వచ్ఛంద భటులు గలరు. వారెల్లరు నత్యంతశ్రమలకోర్చి రాత్రింబవళ్ళు విధినిషేధముల నెఱుంగక తమ సేనాధిపతి యాజ్ఞలను బాలిం చుచుండిరి. కొందఱు వేకువనే మొల్కాని వివిధగ్రామముల కరిగి

ప్రచారకశాఖవారందిచ్చు వార్తల నందించి వచ్చుచుండిరి. మఱికొందఱురి మొగసల వేచియుండి జప్తుచేయుట కుద్యోగి వచ్చుచున్న యాచూకీ తెలియగనే గ్రామస్థులకుఁ దెలుపు చుండిరి. ఇంకఁ గొందఱు రహస్య పరిశోధక బృందముగనుండి యుద్యోగస్థుల పన్నాగముల నెఱింగి గ్రామజనుల కెఱింగించు చుండిరి. మఱల నందఱును రైతులమధ్యకరిగి వారికి నాయ కుని సందేశమును వివరించుచు వారిలోని యుత్సాహాగ్నిని రగుల్కొల్పి వచ్చుచుండిరి. రాత్రికిఁ దమ శిబిరములు చేరి శిభిరాధిపతికిఁ దామొనర్చిన కృషినిగూర్చి నివేదిక నొసంగి, యొండొకటి కేదియేని మెసవి, పలుగుటా నేలపై శరీరముల వాల్చుచుండిరి.

ఇఁక సేనాధిపతి సర్దారు పటేలు క్రోధమన నెట్టిదియో నెఱుంగఁడు. విశ్రాంతి నెఱుంగ ననవరత సంచార సంజనితా యాస భరమ్ము కరమ్ము నోరిమితోడ సహించి, సర్వబాధ్య తలవహించి, నిరంతర నిరుపమ నిరాఘాట నిరవధికోపన్యాస ముల జనుల సమరోత్సాహమును రేకెత్తించుచుండెను. ఇది రాత్రియని, ఇది పగలని విచారింపఁడు. తిన్నచోటఁ ద్రాగడు తాగినచోటఁ దినుటలేదు. ఆయనకు మోటారుబండియే గృహమయ్యెను. అందే భోజనము, అందే పడక.

ఒకనాఁడొక యనుచరుఁడు వానితో నిట్లనియెను.

“అయ్యా! ప్రభుత్వమువారు మన మోటారునకు ననుమ తిని నిరాకరించిన మనమేమి సేతుము ?”

"మనకు భగవంతుఁ డొసంగిన పాదములు లేవా? దినమున కిరువదియైదు మైళ్ళు నిరభ్యంతరముగ నడవఁగలము. కాకున్నను వర్షఋతువు వచ్చిన మనము బురదలో ముండ్లలో నడువవలసియుండునుగదా! అందులకు మనము సంతోషమున నంగీకరింపమా?"

ఇంతేగాక మఱికొందరాయనయొద్ద చేరి ప్రభుత్వోద్యోగుల నాటంకపఱచు యత్నములు సలుపు సలహాలొసంగుచుందురు. అట్టితఱి వారిని శాంతపఱచి దౌర్జన్య రాహిత్య సిద్ధాంతమును వారి హృదయాంతరాళముల నాటుకొనునటుల బోధించి వారిని తత్ప్రయత్న విరమణము నొనర్పఁజేయును.

సర్దారుని యుపన్యాసములు వారిని వేదాంతులుగను జ్ఞానులగను, వీరవరులుగను దయారుచేసెను. ఒకనాఁడు జప్తు చేయు నధికారి సాయుధ రక్షకదళముతో నొక పట్టిభుత్వాపించను దోగి గృహమును ముట్టడించెను. తలుపు తెఱచిన లోనికేగవలయునని యాతఁడట నుదయ మూరుగంటలనుండి సాయంకాల మూరుగంటలదనుక వేచియుండెను. ఆవృద్ధపింఛను దారుని పత్ని తన సౌధవాతాయనమున గూరుచుండి రామ నామజపము గావించుచుండెను. ఆ సమయమున సర్దారా ప్రాంతమునఁ బోవుట తటస్థించెను. అంత నాతఁడిట్లనియె.

"ఓమాతా! నీగృహము పోలీసుల ముట్టడికి గుఱియైనందులకు భయమొందుచుంటివా?" యనెను.

అంతనాపై రక్షించువాఁడు భగవంతుఁడుండ భయపడ వలసిన పనియే”మని ప్రత్యుత్తరమిడెను.

“ఈపోలీసులు నీయింటిముందుండుట నీవెట్లు తలంచుచున్నా” వని మఱల నాతఁడు పృచ్ఛించెను.

వెంటనే యావీరమాత “వారికి నాస్వాగతము. లేనిచో సర్దారు నావాకిటి ముందునకు వచ్చు భాగ్య మెదవదుగదా” యనెను. ఆమె శాంతశీలము నుతింపఁదగినది.

ఈ సత్యాగ్రహ సమరములో స్త్రీలు చూపినసాహసము, త్యాగము కొనియాడతగినది. ఒకయూర నొక వ్యవసాయదారుడు గలడు. ఆయన కడు నమాయకుఁడు. ఆతని భార్య వీరపత్ని. మాంచాల, మల్లమాంబలతో నుద్దియగు పతివ్రతామతల్లి. ఆయింటికి జప్తుచేయు నుద్యోగి యొకనాఁడు వచ్చెను. అప్పుడా యింటికాపు లేఁడు. వాని భార్యయే వారు లోనికి ప్రవేశింపకుండ ద్వారమును బంధించెను. వెంటనే పోలీసువారా యమాయిక రైతుపై నభియోగమును దెచ్చిరి. పోలీసువారితో నావనిత తన భర్త యాసమయమున నింటలేడని విన్నవించుకొనెను. కాని వారామె ప్రార్థనమును నిరాకరించిరి. ఆతనిని బందీకృతునిగావించి న్యాయస్థానమునకుఁ దీసికొని పోఁబోవుచుండిరి. ఆమె యాతనివెంటనంటి మార్గమధ్యమున తననాథుని వల్లభాయిగారి యొద్దకుఁ గొంపోయెను. వారియెదుట నాథుని ధైర్యవచనములుజెప్పి జైలు శిక్షననుభవించుటకు జంకవలదని పలికెను. న్యాయస్థానమునకు వెళ్లిరి. అచట నారైతున

నెలలు కఠినశిక్ష విధించిరి. వెంటనే యామె ధీరురాలై తన భర్తతో నిట్లనుడివెను.

"ధైర్యముగా జైలునకుఁబొండు. ఇట్టి సదవకాశము లభించుటరిది. భార్యాపుత్రులకై మనసున బెంగఁగొనకుము. మేమిచట సుఖముగ నుందుము. భగవంతుఁడు మీకు బలము, ధైర్యము నొసంగుగాత!"

ఇట్లామె భర్తను జైలునకంపి తనభర్తకుమిత్రబృందము పారితోషికముగ నొసంగిన తొమ్మిదిరూప్యములను వల్లభాయి గారి పాదములకడనిడి తన భర్తకిట్టి యపూర్వగౌరవము లభించినందులకు గర్వపడెను. భర్తయు శిక్షాకాలము నత్యంతో త్సాహమున గడపి సుఖముగ నాలుబిడ్డలంజేరెను.

బార్డోలీ స్త్రీలీ సమరమునజూపిన సాహసపుఁ బను లెన్నియేని గలవు.

బార్డోలీలో నిట్టి సంకుల సమరము జరుగుచున్న కాలముననే బార్డోలివాసి, వల్లభాయిగారి సోదరుఁడు విఠల్‌భాయి పటేలుగారు కేంద్రశాసన సభాధ్యక్షుఁడుగా నుండెను. ఆయ నీపోరాటమును నారంభమునుండియు నతిజాగరూకతతో వీక్షించుచుండెను.

ఇట్లుండ ప్రభుత్వమువారు ప్రజల భయభ్రాంతుల జేయుటకై హెచ్చరికలతోడను, నసత్యములతోడను, గూడిన యొకనివేదికను బ్రకటించిరి. సత్యము నెఱింగియున్న శాసన సభాధ్యక్షునకది రోతగలిగించెను. సత్యమును వెల్లడింపక యాతఁ

డుండఁజాలక పోయెను. యాథార్థ్యమును రాజప్రతినిధి కెఱుక పఱచెను. అంతటితో నూరకొనక నెలకు వేయిరూప్యముల విరాళమును సత్యాగ్రహనిధికి వాగ్దానముసేయుచు గాంధిజీ కిట్లు లేఖ వ్రాసెను.

"ఈ సమరము నందలి యుద్దేశ్యమును నేను పరిశీలించితిని. నాన్యాయవాదబుద్ధికి ప్రజలు నిష్పాక్షిక విచారణ సంఘమును గోరుట న్యాయసమ్మతమనియే తోఁచుచున్నది. తమ బాధానివారణమునకు వలయు సాధనములన్నియుఁజూచియే తుదకీమార్గాన్వేషణ మొనరించి యున్నారని గ్రహించితిని. ప్రభుత్వమువారు ప్రజలయెడ, నిరపరాధులగు రైతు బిడ్డల యెడ నొనర్చుచున్న నిర్బంధములను క్రోధపూరితమానసుఁడనై తిలకించుచున్నాను.

తాలూకా ప్రజలిట్లతి హైన్యముగ బాధింపఁబడుచుండుటను నేను సోమరిగ నుండి చూడజాలను. ప్రభుత్వ నిర్బంధమున కసమ్మతి సూచకముగా సత్యాగ్రహ నిధికి వేయి రూప్యములు పంపుటకంటె నెక్కుడు సేవ చేయఁజాలనందులకు జింతించుచున్నాను. ఈసమరము సాగునంతవఱ కిట్టులే ప్రతి మాసమునకుఁ బంపుచుందును. బార్డోలీ బాధితుల కింతకంటె నెక్కువఁగ సేవ చేయఁగల విధానము నాకుఁ గన్పించుచో నెంతమాత్రమును సంశయించువాఁడనుగాను".

ఈవార్త వెలువడఁగనే కేంద్రశాసనసభ్యులగు నారిమన్, బూలాభాయి దేశాయి, నారన్‌దాస్ జేచార్, జయరాందాస్,

వాలత్రాం గారలు తమ సభ్యత్వములకు రాజీనామా యొసం గిరి. ఇంతేగాక తాలూకాలోని యిరువదిముగ్గురు పటేళ్ళును, పదునొకొండుగురు తలాటీలునుగూడ తమపదవులను విసర్జించిరి. పెద్దయుద్యోగులకంటె నిజముగాఁ జిన్నయుద్యోగులు పదవీ త్యాగము చేయుటయందే మహత్తర త్యాగ మిమిడియున్నది. సత్యాగ్రహ నిధికి ద్రవ్య మపరిమితముగఁ జేకూరెను. రాష్ట్రి రాష్ట్రేతరవాసులే గాక దేశాంతర వాసులనుండియు నార్థిక సహాయము రా మొదలిడెను. మొత్తమువిూఁద ముప్పదివేల రూప్యముల నిధి సేకరింపఁబడినది.

ఒకవంక సత్యాగ్రహయుద్ధజ్వాలలు ప్రజ్వలించుచుండ మఱియొకవంక ప్రభుత్వమునకు సత్యాగ్రహులకు సంధిపొసం గింపఁగొందఱు యత్నించుచుండిరి. అట్టివారిలో శ్రీ కె. యం. మున్షీగారి ప్రయత్నము లెన్నదగినది. ఆయన తుదిసారి బొంబాయి ప్రభుత్వ ఆర్థికసభ్యుఁడగు సర్ చునీలాల్ మెహతా గారితో సంప్రతించెను.

తత్ఫలితముగా గాంధిజీ వల్లభాయిల కనీసపుకోర్కెలను కనుఁగొనవలసినదిగా నాతఁడు కోరఁబడెను. ఆప్రకారము వారి యొద్దనుండి సంధిషరతులను గైకొని మున్షీగారు మరల గవర్న రుగారిని సందర్శించిరి. కాని మరల కథ యథాప్రకారముగనే యుండెను. ఆ నియమములకు గవర్నరుగా రంగీకరింపలేదు.

బార్డోలీసత్యాగ్రహము ప్రశాంతముగ జరుగుచునే యున్నది. ఇఁక నాయకుఁడగు వల్లభాయి నిర్బంధింపఁబడు

ననువార్తలు వ్యాపించుచుండెను. వల్లభాయి జైలునకు వెళ్ళిన పిదప సమర మెట్లునడపవలయునో యని సంప్రతించుటకు గాంధిజీ బార్డోలికిఁజనెను. గాంధిజీకి ప్రజ లఖండస్వాగత మొసంగిరి. ప్రజల వజ్రసంకల్పమును దిలకించి సంతుష్టిని నాతఁడు కనుబరచెను. వల్లభాయికోరికపై గాంధిజీ సార్భాను, రాయం గ్రామములకుంజని యచ్చటి జనుల యుత్సాహమును గమనించెను.

రాయంలో బహిరంగసభ జరిగెను. వేలకువేలు జనులాసభ కరుదెంచిరి. పండ్రెండు గంటలయ్యెను. మిట్టమధ్యాహ్నపు వెట్టనైనను లెక్క పెట్టక జనసమూహము గాంధిజీ దర్శనోత్సుకత నటఁగూడిరి. పెందలకొలఁది స్త్రీలుగూడ నట కరుదెంచిరి. వారందఱు మహాత్ముని బూజించిరి. కానుక లొసఁగిరి. గాంధిజీ నాఁటిసభయం దిట్లునుడివెను.

“మీసర్దారుని యాజ్ఞాబద్ధులై మీరు తగుక్రమశిక్షలో మెలఁగుచుంట నింక నేఁజెప్పవలసిన దేమియులేదు. అతఁ డిట నుండి నన్నేదియేని జెప్పుమనినఁ జెప్పెడివాఁడనే. వానియాజ్ఞలను పాలించుట మీకెంతవిధియో, నీప్రాంతమునకువచ్చిన నాకును వాని యాజ్ఞాపాలనము కర్తవ్యము. ఆతనికంటె వయోవృద్ధుఁడనే యగుదునుగాని ప్రజాజీవితములో చిన్న, పెద్ద తారతమ్యములేక నాయకునియాజ్ఞ పాలించుట విధి. పూర్వము శ్రీకృష్ణునిఁబోలు మహానుభావుఁడుసైతఁ మీనియమము బాటించియే యర్జునుని రథికునిగానొనర్చి తాను సారథి యయ్యెను.

వల్లభాయివలన మీకీర్తి దిగంతములఁ బ్రాకినది.
మీరింకను ఘనకార్యము లొనర్తురుగాత!"

గాంధిజీ బార్డోలీలో స్థిరపడెను. వల్లభాయిని సంధికై సర్ చునీలాలుగారి ప్రోత్సాహమువలన పూనాకుఁ గొందఱు మిత్రు లాహ్వానించిరి. గాంధిజీ యాశీర్వాదమునుబొంది వల్లభాయి పూనాకరిగెను. అట చునీలాలుగారి యతిథిగ నుండెను. సంప్రతింపులు జరిగినవి. తర్జనభర్జన లైనవి. ఆశానిరాశల మధ్యమున రాయబారుల మనంబులూయలలూఁగినవి. మున్షి గారచట ప్రధానపాత్రము వహించిరి. వల్లభాయి కల్లబొల్లి పలుకులకు మోసపోవువాఁడుకాఁడు. ఇచ్చకములకు, మొగమోటలకుఁ దలనాడించువాఁడుకాఁడు. తుట్టతుదకు గౌరవప్రదమగు సంధికుదిరెను. ఆవార్త బార్డోలియందు ప్రకటింపఁ బడెను. అందఱును సంతోషమును వెల్లడించిరి.

సత్యాగ్రహసమరము నాయకుని యాజ్ఞానుసారము నిలిపివేయబడెను. క్రొత్తపన్నులను ప్రభుత్వమువా రుపసంహరించుకొనిరి. పాతపన్నులు శరవేగమున వసూలయ్యెను. ఖయిదీలు విడుదలచేయఁబడిరి. రాజీనామాయొసంగిన మునసబులకు, తలాటీలకు మరల నుద్యోగములు లభించెను. జప్తు చేయఁబడిన యాస్తులు తిరిగి రైతుల కొసంగఁబడెను. సర్వము దిగ్విజయమయ్యెను. విజయభేరీ మ్రోగెను. సర్దారు నామము భారతదేశమున ప్రతిధ్వనించెను.

# 'సైమన్‌కమిషన్' - బహిష్కారణోద్యమము

## ఆంధ్రకేసరి శ్రీ ప్రకాశంపంతులు.

అవి 1928 సంవత్సరమునందలి తొలిదినంబులు. పర ప్రభుత్వముమీఁద ప్రజలలో పూర్తిగా విద్వేషాగ్ని ప్రజ్వలించినది.

అట్టి సమయమున ఆంగ్లప్రభుత్వము 'సైమన్‌కమిషన్' నియామకమును ప్రకటించుటతో భారతజాతి మఱింతసంక్షోభమును చెందినది. స్వాతంత్ర్య పిపాసులగు దేశీయులు 'సైమన్ కమీషన్'ను నిరోధిపఁ గృతనిశ్చయులైరి.

'సైమన్‌కమీషన్' నియామకమును భారతీయులు తలవంపుగను, అవమానకరముగను భావించిరి. 1928 సంవత్సరమంతయు 'సైమన్‌కమిషను' బహిష్కార చరిత్రయే. ఈసంఘము ఎక్కడకు వెళ్ళినను నల్లజెండాలు, పోలీసుహడావుడులు, లాఠీచార్జీలు, తుపాకికాల్పులు జరిగెవి. ఇర్విన్‌ప్రభువు సాంత్వవచనములు వారిని సంతుష్టాంతరంగులను జేయవయ్యెను. భారతీయుల అంగీకార, అనంగీకారములతో నిమిత్తములేకుండగనే పార్లమెంటుకు కమిషన్ తనసిఫారసుల నివేదింపఁగలదనియు వాని నమలుజరుపుటనుగురించి పార్లమెంటు తగువిధమున తీర్మానింపఁగలదనియు ఇర్విన్‌ప్రభుత్వము ప్రకటించినది. దానితో దేశములో పరిస్థితి మఱింతవిషమించినది. 1928 సంవ

త్సరము ఫిబ్రవరి రెండవ తేదీని ఇర్విన్‌ప్రభుత్వము చేసిన యీ ప్రకటనకు భారతజాతి ప్రత్యుత్తర మొసంగవలసి యుండెను. పైప్రాయి ప్రకటన వెలువడినమఱుచటిరోజున అనగా ఫిబ్రవరి మూఁడవ తేదీని బొంబాయిలో కమిషన్ సభ్యులు ఓడదిగిరి.

'సైమన్ కమిషను' భారత దేశములో అడుగిడినరోజుననే దేశమంతయు హరతాళముతో బహిష్కరణోద్యమము ప్రారంభమయ్యెను.

కలకత్తాలో పోలీసుబలగమునకు విద్యార్థులకు సంఘర్షణ చెలరేగెను. కమిషను ప్రప్రథమమున భారత దేశరాజధానీ నగరమగు ఢిల్లీని సందర్శింపవలసియుండెను.

కమిషన్ వారికి ఢిల్లీపౌరులు "సైమన్ తిరిగిపో" అను నినాదములతో స్వాగతము చెప్పిరి. ఎచ్చటచూచినను నల్ల జెండాలే! ఎచ్చటవిన్నను "సైమన్ తిరిగిపో" నినాదములే! దక్షిణభారత దేశములోని జస్టిసుపార్టీ, కొన్ని ముస్లింసంఘములుతప్ప దేశమంతయు వ్యతిరేకోద్యమములో సమధికోత్సాహముతో పాల్గొనినది.

మహోగ్రరూపమును దాల్చిన ఈవ్యతిరేకోద్యమమును అణచివేయుటలో ప్రభుత్వము అపూర్వదమననీతిని ప్రయోగించినది. పంజాబ్ కేసరి లాలాలజపతిరాయ్ నాయకత్వమున లాహోరులో బయలుదేరిన ఒకబ్రహ్మాండమైన ఊరేగింపుపై పోలీసులు లాఠీచార్జిచేసిరి. ఈసమయమున జరిగిన లాఠీప్రహారణముల ఫలితముననే వీరసింహుఁడు లాలాలజపతిరాయి దివంగ

తుండమ్యెను. దేశముముక్త కంఠముతో కోరినను ఈవిషయమై ప్రభుత్వనిష్పాక్షిక విచారణసంఘమునునియమించలేదు. లక్నో పట్టణమున పండిత జవహరలాల్ నాయకత్వమును బయలు దేరిన ఊరేగింపు ఆశ్వికరక్షకభటులను ఎదుర్కొ-సినది. పండితుని కుసుమకోమల శరీరము లాఠీప్రహారణముల నెదుర్కొ-నవలసినదయ్యెను. లక్నోనగరము ఒక రణరంగముగా మారిపోయెను. 'అయినను భారతదేశము భారతీయులదే' సైమన్ తరలిపొమ్ము అను నినాదములతో లక్నో ప్రతిధ్వనించెను. వీరపుంగవుడు, సాహసోపేతుడునైన జవహర్ నాయకత్వమున సంయుక్తరాష్ట్రమంతయు సైమన్ కమీషన్ బహిష్కరణోద్యమమున సమధికోత్సాహముతో పాల్గొనెను.

బీహార్ రాష్ట్రమునకు ముఖ్యపట్టణమగు పాట్నానగరమున ఏబదివేల ప్రజానీకము ముక్తకంఠముతో సైమన్ రాకయెడ తమ అసమ్మతిని దెల్పియుండెను.

మద్రాసు నగరమున ఆంధ్రకేసరి శ్రీ టంగుటూరి ప్రకాశముపంతులు నాయకత్వమున కృతనిశ్చయమైన ప్రజానీకము సైమన్ రాకను నిరోధించుచు బ్రహ్మాండమైన ఊరేగింపు బయలుదేఱదీసెను. ఆంధ్రకేసరి అగ్రగామియై అచంచల ధైర్యముతో అప్రతిహత విప్లవశక్తితో యౌవనోత్సాహముతో రంగస్థలిలోనిల్చి ఆంధ్రజాతి కీర్తిని నిలుపగలిగినందుకు మనము ధన్యులము. అట్టి వీరవతంసునికన్న ఆంధ్రమాతధన్యరాలు. స్వార్థమెఱుగని దేశసేవాతత్పరత; మొక్కవోని సాహసము;

సునిసితబుద్ధి ఆంధ్ర కేసరికి పెట్టనిసొమ్ములు. పంజాబ్ కేసరి లజపతిరాయి పంజాబులో విజృంభించెను. పండిత జవహర్‌లాల్ సంయుక్తరాష్ట్రము నట్టూతలూఁగించెను. వీరాగ్రేసరుఁడగు సుభాష్ యావజ్జాతి సెబాస్ అనునట్లు బెంగాలులో గర్జించెను. ఆంధ్ర కేసరి మద్రాసులో స్వైరవిహారము చేసెను. మద్రాసులో ఉన్నతన్యాయస్థానము నెదుట సత్యాగ్రహులు 'సైమన్ తిరిగిపో' సినాదములతో బ్రహ్మాండమైన ఊరేగింపు జరిపిరి. వెల్లివెరియు ప్రజోత్సాహమును అరికట్టుటకు ప్రభుత్వము తుపాకికాల్పులను సాగించినది. ఈకాల్పులవలన అసంఖ్యాకు లగు సత్యాగ్రహులు గాయపడిరి; ఒకడు నిట్టనిలువున మరణించెను. తరువాత మఱియిర్వురు అసువులఁ బాసిరి. అంతటితో ప్రజోద్రేకము ఆకసమునంటెను. పట్టణములో వేఱొక చోట ఉద్యమమును నడుపుచున్న ఆంధ్ర కేసరి కీవర్తమానము క్షణ కాలములో నందెను. ఆవీరుని శరీరము కంపించెను. కంఠము గద్గదమయ్యెను. అరుణారుణనేత్రుఁడై, అరిభీకరుఁడై ఆంధ్ర కేసరి పరుగుపరుగున శ్మశానవాటికవోలెయొప్పొందిన హైకోర్టు వద్దకుఁ జనెను. అసహాయుఁడగు సాత్వికనిరోధియొకఁడు ముష్కరయోధుల తుపాకికాల్పుల కెరయయ్యెను. ప్రభుత్వము-ఆశవమును సహితము ప్రజలకీయ నిరాకరించినది. ఇది యెంత హృదయవిదారకము! అక్కడ ప్రజలు ఆశవమును తమ స్వాధీనముచేయవలసినదని కోరినను సైనికులు దానిని హైకోర్టు ఆవరణలో దాచిరి. ప్రకాశం హైకోర్టులో ప్రవేశింప నుద్యుక్తుఁ

డయ్యెను. హృదయములేని పరప్రభుత్వము తననుసహితము త్రుటిలో కాల్చివేయఁగలదని ఆంధ్ర కేసరికిఁ దెలియనిదికాదు. జాతిగౌరవము తరువాతనేకదా ప్రాణము. త్యాగధనులకు ప్రాణమన్న తృణప్రాయము. సిపాయిలు తుపాకులు బారు చేసిరి. ఆంధ్ర కేసరికి ముందడుగేకాని వెనుకంజలేదాయె. ఒక సారికాదు, రెండుసార్లు, మూడుసార్లు గాలిలో తుపాకిబారులు చెలరేగినవి. అగ్నికణములు వ్యాపించినవి. దిక్కులు మారు మ్రోఁగినవి. భూమి కంపించినది. వెఱ్ఱిసిపాయిలు ప్రకాశమును బెదిరింపదలఁచిరి! తాటాకుచప్పుళ్ళకు కుందేళ్ళు బెదురునా!

స్వతంత్రబలిపీఠమున ఆత్మార్పణచేయ సంసిద్ధుఁడైన ఆవీరసింహుని కాల్చుటెట్లు? ఆయన త్యాగశక్తి వారిని వశీభూతులచేసెనో లేక ఆ తేజోమూర్తి వెలుగు వారికన్నుల మిరుమిట్లుగొల్పెనో వారు కర్తవ్యతావిమూఢులై ఒక్కత్రుటి పాటు అచేతనులైరి. "మృతకళేబరమును స్వాధీనముచేయుడు-లేదా యిదిగో గుండె" అనుచు తుపాకిగుండులకు తనగుండె నెదురొడ్డెను. ఆదృశ్యమే భారతజాతీయ స్వతంత్రచరిత్రలో అపూర్వమైనది. ఆ దృశ్యమునుగాంచిన మద్రాసుపౌరులు ధన్యులు. పరుగు పరుగున జస్టిస్ పాండలె అరుగుదెంచి శవము పంచాయితీ ముగిసినతరువాత ప్రజల ఆధీనము చేయబడునని ప్రకటించెను. వెంటనే పరిస్థితి శాంతించెను. ఆంధ్ర కేసరి సార్థక నాముఁడయ్యెను.

పల్నాటివీరుల గాథలలో వినుతికెక్కిన ఆంధ్రజాతి

మఱొకమాఱు సగర్వముగ మాకును కలఁడు మఱొక లజపతి రాయి' అని గర్వించెను.

సైమన్‌కమిషన్ మార్చి 31 వ తేదీని బొంబాయి రేవును విడిచిపెట్టెను. దేశములోని ప్రముఖులందఱు కమిషన్ బహిష్కరణోద్యమములో పాల్గొనుటవల్ల వారితో చర్చించుటకు వీలు కలుగలేదని సర్ జాన్ సైమన్ ప్రకటించెను తరువాత కమిషన్ వారు తమనివేదికను బ్రిటిష్‌ప్రభుత్వమునకు కేంద్రప్రభుత్వము వారిచేనియమింపబడిన సంయుక్తసంఘమునకు పంపనిశ్చయించి నట్లుప్రకటనకూడవెలువడెను. కాని యీప్రకటనవల్ల దేశములో ఎట్టి అనుకూలవాతావరణమును ఏర్పడలేదు. పైప్రకటన వెలువడిన రెండుమూడు గంటల తరువాత ఢిల్లీలో రాజకీయనాయకులు సమావేశమై, సైమన్ కమిషన్ నివేదికతో తాము ఏకీభవించజాలమనియు దానితో తమ కెట్టి సంబంధములేదనియు విస్పష్ట ప్రకటన చేసివైచిరి. అధినివేశప్రతిపత్తినికోరిరి. కేంద్ర శాసనసభ కమీషనులో సభ్యులను నియమించుటకు నిరాకరించెను. ఇట్టి తీర్మానములను ఎసంబ్లీచే ఆమోదింప చేయుటలో లజపతిరాయి మోతీలాల్‌నెహ్రూలు కృషిచేసిరి. మఱి గత్యంతరములేక ప్రభుత్వము కమిషన్ సభ్యులుగా భారతీయులను కొందఱిని నియమించినది. 1929 లో సైమన్ కమిటీవారు దేశమంతటను సంచారమునుచేసి వచ్చిరి. ఆసంవత్సరమునకు వైస్రాయి ఇర్విన్‌ప్రభువు సీమకువెళ్ళి అక్టోబరులో ఒక ప్రకటన చేసి భారతజాతీయ నాయకులతో ఒకవిధమైన రాజీకివచ్చెను. ఆ

సంవత్సరము డిసెంబరు 23 వ తేదీని గాంధి వైస్రాయి సమా వేశము జరిగెను.

ఈసమయమున ఇర్విన్ ప్రభువు సీమనుండి భారత దేశ మునకుఁ దిరిగివచ్చిన తరువాత నొక ప్రకటన చేసియుండెను.

"భారతదేశపు భావి రాజకీయాభివృద్ధిని గుఱించి విచా రించుటలో భవిష్యత్కాలమునందు బ్రిటిషిండియాకును, భారతసంస్థానములకును మధ్య ఉండవలసిన 'సంబంధ బాంధవ్య ములను' మనస్సునందుంచుకొనుట ముఖ్యమని, తనయొక్కయు తన సహోద్యోగుల యొక్కయు నిశ్చితాభిప్రాయ మయి నట్లుగా సైమన్ తాను ప్రధానమంత్రితో జరుపుచున్న ఉత్తరప్రత్యుత్తరములు స్పష్టపఱచెను. సైమన్ కమిషన్ వారి యొక్కయు, 'ఇండియన్ సెంట్రల్' కమిటీ వారియొక్కయు నివేదికలు ప్రచురితమైన తరువాత 'జాయింటు పార్లమెంటరీ కమిటీ' వారికవి చేరులోపల ఒక మహాసభను సమావేశపఱచ వలెను. ఆ సభలో సంస్థానప్రతినిధులు, బ్రిటిష్ఇండియా ప్రతి నిధులు, ఆంగ్లప్రభుత్వముతో కలసి సాధ్యమైనంతవఱకు అందఱికీ అంగీకారయోగ్యములగు తుదినిర్ణయములు చేయ వలెననియు ఆయన సూచించెను. ఈ సైమన్ అభిప్రాయ ముతో ఆంగ్లప్రభుత్వము సంపూర్ణముగా ఏకీభవించుచున్నది. భారత రాజకీయాభివృద్ధిని గుఱించి జయప్రదముగా నిర్వహింప దగిన అనుకూల పరిస్థితు లాసన్నమైనపుడు ఆంగ్లప్రభుత్వము వారాసమస్యనుగూర్చి విచారించుటకు మిక్కిలి కుతూహలము

కలిగియుందురు. కాబట్టి బ్రిటిష్ రాజకీయతంత్రముయొక్క ఆంతరంగికోద్దేశము ఫలప్రదమగుట కవసరమైనవాని నన్నింటిని సమగ్రముగ విచారింపవలసిన అవసరమును సైమన్ కమిషన్‌వారివలెనే ప్రభుత్వముకూడ పూర్తిగా గుర్తించినది. ఇందుకువలయు చర్యలను పార్లమెంటు తీసికొనవచ్చును. అంతేకాక కాలము పరిపక్వమైన వెంటనే భారతదేశ మధినివేశరాజ్యములతోపాటు సామ్రాజ్యములో సమాన భాగస్వామిగా నుండవలెనని ఆంగ్లప్రభుత్వమువారి ఉద్దేశమైనట్లు బ్రిటిష్ మంత్రులు పెక్కుమార్లు ప్రకటించిరి. భారతరాజ్యాంగ నిర్మాణముయొక్క సహజపరిణామము అధినివేశప్రతిపత్తియే యని స్పష్టముగా ప్రకటించుటకు ఆంగ్లప్రభుత్వము పక్షమున నా కధికారమీయఁబడినది."

ఇది ఇర్విన్‌ప్రభువు సీమనుండి మరలివచ్చిన తరువాత చేసిన ప్రకటన.

పై ప్రకటనకు సమాధానముగా ఢిల్లీలో సమావేశమైన దేశనాయకులు కొన్ని షరతులుపెట్టిరి. శాంతివాతావరణము సమకూర్చుటకు సమాధానపద్ధతి నవలంబింపవలెననియు రాజకీయబంధితుల విడుదలచేయవలెననియు, రాజకీయ సంస్థలకు ప్రాతినిధ్యమిచ్చుటయేకాక కాంగ్రెసుకు నధికప్రాతినిధ్యమీయవలెననియు, భారతదేశమునందెప్పుడు అధినివేశ ప్రతిపత్తి స్థాపింపఁబడునో నిశ్చయింపవలెననియు దేశనాయకులు ప్రకటించిరి.

ప్రకటనలవల్ల పనులు నెఱవేరవు. అందువలన వైస్రాయి ఇర్విన్‌ప్రభువు, మహాత్మునితోను, పండిత మోతీలాల్ నెహ్రూ, మదనమోహనమాలవ్యాలతోను, సంప్రదించి ఒకవిధమైన సంధిచేసికొనవలెనని ఆతృతచెందుచుండెను. హైదరాబాద్ (దక్కన్) లో వీలుకానియెడల ఢిల్లీలో డిసెంబరు ఇరువదిమూఁడవ తేదీని సంప్రదింపులు సాగించఁగలనని వైస్రాయి డాక్టర్ సప్రూకు జాబువ్రాసెను. అనుకొన్నప్రకారము వైస్రాయి ఢిల్లీ చేరఁగలిగెను. దారిలో ఢిల్లీ ఇంకొక మైలు దూరమున్నదనఁగా రైలుక్రింద బాంబు ప్రేలుటకూడ జరిగెను. కాని వైస్రాయికి ప్రమాదము కలుగలేదు. ఈ సంఘటనవల్ల ఇర్విన్‌ప్రభువు ఎంతమాత్రము చికాకుపడలేదు. ఆరోజున మోతీలాల్ నెహ్రూ, మహాత్మాగాంధీలతో సంప్రదింపవలెను. వారితోనేగాక జిన్నా, సప్రూ, వల్లభాయిపటేల్ గార్లతో చర్చింపవలసియుండెను. హృదయమువిప్పి మాట్లాడుకొనుటకు ఏర్పరచుకొనిన సంప్రదింపులు ఒక రాయబారముగా మారెను. సైమన్‌కమిషన్ నియామకమునాటి కఠినత్వము నాడు కానరాలేదు. సంప్రదింపులలో మొదటి నలువదియైదు నిమిషములు బాంబు సంఘట్టనను గుఱించి చర్చించుటతో సరిపోయెను. రాజకీయ బంధితుల విడుదలనుగూర్చి చర్చించి అందువల్ల అనుకూలవాతావరణమును సృష్టించవలెనని ఇర్విన్ భావించి 'రాజకీయబాధితుల గురించి ఆలోచించుటతో సంప్రదింపులు ప్రారంభించుదమా!' అని మహాత్ముని ప్రశ్నించెను.

కాని మహాత్ముఁడు అధినివేశప్రతిపత్తిని గుఱించి నిర్ణయింపుదమని సమాధానము చెప్పెను. సంపూర్ణ అధినివేశప్రతిపత్తి నొసంగు వాగ్దానమును పురస్కరించుకొని రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సును సమావేశపఱచవలెనని మహాత్ముని వాదన. కాని వైస్రాయి ప్రభుత్వమదివరకుఁ జేసియుండిన ప్రకటనను జవదాఁటి ఎట్టి వాగ్దానములను జేయు స్థితిలోలేఁడు. అధినివేశ ప్రతిపత్తిని వాగ్దానముచేయు షరతుపై రౌండ్ టేబిల్ సభకు ఆహ్వానములు పంపుట ఇర్విన్ శక్తికిమించిన పని. కాని మహాత్ముఁడు కోరినది భారతీయుల అభీష్టసిద్ధికాని రాజకీయ ఖైదీల విడుదలకాదు. ఆతని దృష్టిలో భారతదేశమే అప్పుడొక కారాగారము. అట్టియెడ జైలులో నున్నవారి విడుదల ఒక ప్రశ్నయేకాదు. ఈవిధముగా లాహోరు కాంగ్రెస్‌కు ముందు వైస్రాయి గాంధీలకు జరిగిన సంప్రదింపులు నిరుపయోగముగ పరిణమించినవి. అందువలన లాహోరులో సంవత్సరాంతమున పండిత జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షతను సమావేశమగుచున్న కాంగ్రెస్ మహాసభ గురుతర కార్యభారమును వహించవలసినదయ్యెను. సంపూర్ణస్వాతంత్ర్యమే భారతజాతి లక్ష్యమని నెహ్రూపండితుని అధ్యక్షతను లాహోర్‌లో చారిత్రాత్మకమగు నిర్ణయమును చేసినది. తదుపరి 1930 సంవత్సరము జనవరి రెండవ తేదీని జరిగిన కాంగ్రెస్ కార్యనిర్వాహకవర్గ సమావేశములో ప్రతి సంవత్సరము జనవరి ఇరువదియాఱవ తేదీని స్వాతంత్ర్యదినముగా పాటించవలెనని తీర్మానించఁబడినది.

సైమన్ కమిషన్ బహిష్కరణోద్యమముతో దేశీయులు అధినివేశప్రతిపత్తినుండి సంపూర్ణస్వరాజ్య నినాదమునకు తమ కార్యక్రమమును మార్చుకొని అందుకువలయు పోరాటమునకు ఉపక్రమించిరి. పిమ్మట ఉప్పుసత్యాగ్రహము కొనసాగించి, 'క్విట్ ఇండియా' మహోద్యమముతో సంపూర్ణస్వరాజ్య సౌధనిర్మాణమును పూర్తిగావించిరి. అశోకచక్రచిహ్నితమైన భారతజాతీయ పతాకమును ఆ స్వతంత్ర విజయసౌధాగ్రముపై 1947 ఆగష్టు పదునైదవ తారీఖున విజయసౌధ నిర్మాతయగు మహాత్ముని ఆశీర్వాదములతో రాజేంద్రప్రసాదు, నెహ్రూ, పటేల్, ప్రకాశము ప్రభృతులు ఎగురవేసిరి. అసంఖ్యాక భారతప్రజానీకము కర్పూరనీరాజనముతో జేజేలు వెట్టెను.

హిం ద్!



రాయల ముద్రణాలయము, తెనుకు. జూలై, 1950.